# ఇతర డైలు అన్నీ కలిపి ఎంతమంది వాడుతారో అంతకంటే ఎంతో ఎక్కువ మంది తనంతటతానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైనే వాడుతారు.

ఇవిగో 3 మంచి కారణాలు:



రెండు నైసర్గిక రంగులలో లభ్యం—
బ్లాక్ మరియు డార్క్ బ్రౌన్.

**1** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై మీ జుట్టుకు అందిస్తుంది నైసర్గిక రంగు, రూపం జుట్టును మృదువుగాను, ఎలా కావలిస్తే అలా చక్కగా వుంచుకోడానికి దీనిలో కండిషనర్ కూడా వున్నది

నిజానికి, వేసుకొన్నారని మీరు చెప్పితే తప్ప ఎవరికీ తెలియదు.

**2** ఇతర హేర్ డైలలాగా కాకుండా, తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైని సులభంగా, అనుకూలంగా వేసుకోవచ్చు.

అవును, జుట్టును షాంపూ చేసుకోవడం లాగే ఎంతో సులభం

**3** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై నాణ్యత సంబంధంగా మీరు నిశ్చింతగా వుండవచ్చు. ఎందుకంటే, మీ జుట్టును, చర్మాన్ని సంరక్షించడానికి ఇది ప్రత్యేకంగా తయారు చేయబడినది.

పరిపూర్ణ రక్షణ—ఇదే గోద్రెజ్ వాగ్దానం.

**గోద్రెజ్®** తనంతట తానే వ్యాపించే పర్మనెంట్ హేర్ డై.

CLARION/B/GS/50/173/TL



JAGATI Rs. 2-00 February 1989

34th Year of Publication

# జగతి

ఎడిటర్ : చందూర్

ఫిబ్రవరి – 1989



'ఆధునిక ప్రెస్ కాన్ఫరెన్సులు'

—'అమెరికన్ న్యూస్ లెటర్' సౌజన్యంతో

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 – చందా 2 సం॥లకు రు. 45-00. – 5 సం॥లకు రు. 100-00. జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00 విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం : రాష్ట్రపతి వెంకట్రామన్

# నిమ్మతొనలు

మంత్రిగారిని భార్యామణి అడిగింది: 'ఏమండీ, మీరు ఈరోజు బాలా తెల్లగా కనిపిస్తున్నారేమిటి ?'

'అంతేమరి - ప్రతి పక్షాలు ఉతికే శాయి'

— కె నాగేశ్వరరావు
నరసరావుపేట

జిడ్డులా పట్టుకొని ఎంతకీ వొదలని వాళ్లని వొదిలించుకోవడమెలా ? - అని సలహా అడిగాడు శేఖరం, మాధవ రావుని.

'ఆ కిటుకు నాకు తెలిస్తే నీవు నా పక్కన వుండేవాడివా ?' - అన్నాడు రఫీమని మాధవరావు.

— జి రాము
నందిగామ

లక్ష్మీ, నీకు ముక్కు మీద ఉంటుంది కోపం....'

'ఘనత వహించిన బావగారూ మరొకసారి సెలవీయండి'

'మరదలా, నీకు ముక్కుమీద ఉంటుంది కోపం' - అన్నాడు శ్రీధర రావు.

'అది నా ముక్కు పుడకకి అందం కద !' - అంది లక్ష్మి నవ్వేస్తూ.

— బి జేసుదాసు
కొండపల్లి

క్రాపు చేయడానికి ఎంత పుచ్చుకుంటున్నావయ్యా ? - అని అడిగాడు బట్టతల భాస్కరరావు బార్బర్ని.

'వెనక ఎనిమిది పుచ్చుకొనే వాడిని - ఇప్పుడు పది, సార్'

'ఈ బాల్డ్ హెడ్‌కి కూడా పది రూపాయలా ?' అని ప్రశ్నించాడు భాస్కరరావు.

'బట్ట తలలోని వెంట్రుకలు వెతికేందుకు యివ్వవచ్చు కదుటండీ..' అన్నాడు బార్బర్.

— వైవి రమణ
చీరాల

బాబూ, ఇక్కడ నుంచి తిరుపతి దైవ సన్నిధికి వెళ్లాలంటే ఎంత సేపు పడుతుంది ? - అని అడిగాడు పార్వతీశం బస్సుడిపోలో

సిగరెట్టు కాల్చుకుంటూ నిలబడ శ్రీనివాసు చెప్పాడు : 'బస్సు కరెక్టుగా వెళితే పదిగంటల వ్యవధిలో చేరుకుంటారు. మధ్యలోగాని యాక్సిడెంట్ అయిందా వెంటనే చేరుకుంటారు'

— కె శేఖరబాబు
మైలవరం

రాంబాబూ, నీకు ఉద్యోగం లేక పోయినా మా అమ్మాయిని చేసుకుంటానంటున్నావ్ - బావుంది పిల్ల

# నిమ్మతొనలు

మంత్రిగారిని భార్యామణి అడిగింది:
'ఏమండీ, మీరు ఈరోజు చాలా తెల్లగా కనిపిస్తున్నారేమిటి?'
'అంతేమరి - ప్రతి పక్షాలు ఉతికేశాయి'

— కె నాగేశ్వరరావు
నరసరావుపేట

జిడ్డులా పట్టుకొని ఎంతకీ వొదలని వాళ్లని వొదిలించుకోవడమెలా? - అని సలహా అడిగాడు శేఖరం, మాధవరావుని.
'ఆ కిటుకు నాకు తెలిస్తే నీవు నా పక్కన వుండేవాడివా?' - అన్నాడు రఫీమని మాధవరావు.

— జి రాము
నందిగామ

లక్ష్మి, 'నీకు ముక్కు మీద ఉంటుంది కోపం....'
'ఘనత వహించిన బావగారూ మరొకసారి సెలవీయండి'
'మరదలా, నీకు ముక్కుమీద ఉంటుంది కోపం' - అన్నాడు శ్రీధరరావు.
'అది నా ముక్కు పుడకకి అందం కద!' - అంది లక్ష్మి నవ్వేస్తూ.

—బి జేసుదాసు
కొండపల్లి

క్రాపు చేయడానికి ఎంత పుచ్చుకుంటున్నావయ్యా? - అని అడిగాడు బట్టతల భాస్కరరావు బార్బర్ని.
'వెనక ఎనిమిది పుచ్చుకొనేవాడిని - ఇప్పుడు పది, సార్'
'ఈ బాల్డ్ హెడ్కి కూడా పది రూపాయలా?' అని ప్రశ్నించాడు భాస్కరరావు.
'బట్ట తలలోని వెంట్రుకలు వెతికేందుకు యివ్వవచ్చు కదుటండీ..' అన్నాడు బార్బర్.

— వైవి రమణ
చీరాల

బాబూ, ఇక్కడ నుంచి తిరుపతి దైవ సన్నిధికి వెళ్లాలంటే ఎంతసేపు పడుతుంది? - అని అడిగాడు పార్వతీశం బస్సుడిపోలో
సిగరెట్టు కాల్చుకుంటూ నిలబడ శ్రీనివాసు చెప్పాడు: 'బస్సు కరెక్టుగా వెళితే పదిగంటల వ్యవధిలో చేరుకుంటారు. మధ్యలోగాని యాక్సిడెంట్ అయిందా వెంటనే చేరుకుంటారు'

— కె శేఖరబాబు
మైలవరం

రాంబాబూ, నీకు ఉద్యోగం లేకపోయినా మా అమ్మాయిని చేసుకుంటానంటున్నావ్ - బావుంది పిల్ల

# పాఠకుల తీర్పు

శ్రీయుత చందూర్‌గారికి, మన్నార్ నమస్కారములు. సాంస్కృతిక ఉత్స వానికి (బిసిఐసి, మీరు తప్పక వస్తా రనుకున్నాము. కాని ఆశ ఫలించ లేదు. కార్యక్రమాల గురించి చిన్న సమీక్ష మీ మనిషిగా పంపు తున్నాను. 'జ గ తి'లో ముద్రిస్తే సం తోషం.... అందరికీ వందనాలు - మీ

—అద్దంకి మన్నార్
న్యూఢిల్లీ -3

శ్రీ చందూర్ గారికి : 'జ గ తి' లో కాకినాడ కబుర్లు చదివి చాలా సంబర పడి పోయాము. మీరిద్దరూ రావడం మా కెంతో సంతోషదాయకం. మాలతి గారిని అడిగినామని చెప్పండి.

—ఎస్ ఉమారావు
కాకినాడ-4

శ్రీ చందూర్ గారికి సప్రేమ నమ స్కారములు .... ఆ రాత్రి చి॥ బుద్ధ ప్రసాద్ అవనిగడ్డ '21' నుంచి తల గడ దీవి '64' కు ఫోన్ చేసి 'నవం బరు - జగతి' చూశారా ? - అన్నారు. 'ఇంకా చూడలేదు - ఇప్పుడే వచ్చాను విజయవాడ నుండి' - అన్నాను. 'చద వండి' - అన్నారు ఆయన .... 'డైరీ' పదమూడు పధ్నాలుగు తేదీలు చది వాను. నాగురించి ఎక్కువగా వ్రాశా రేమో, అనిపించింది. అయినా ఆనంద పరవశుణ్ణి అయాను. కండువా సవ రించు కొంటూ (కాలరు చొక్కా వేయను కాబట్టి) ఆ పేజీలు చదవమని మాఆవిడకు ఇచ్చాను. చదివి నవ్వింది. ఎందుకు నవ్వుతున్నావని అడగ్గా 'వారు కొత్తవారు కదా, పాపం!' అన్నది. నేను మరేమీ చేయలేక కలిపాను. ఈసారి కండువా మాత్రం సవరించు కోలేదు మాలతీ - చందూర్‌గార్లకు నా నమ స్కారములు. భవదీయ....

—యమ్ రామారావు
తలగడ దీవి

గౌరనీయులైన చందూర్‌గారికి నమస్తే - ఉన్నతవిలువలు పెంపొం దించేదిగా ఉన్న 'జ గ తి' నాకు చాలా నచ్చినది. అన్ని అంశాలూ బాగున్నాయి. కాకపోతే, నవ సమా జానికి, యువతరానికి, అభ్యుదయ వాదులకు పనికొచ్చే విధంగా మరి కొన్ని ఫీచర్స్ ఉండవచ్చునేమో ; యువత నుంచి అభిప్రాయాలు....

—ధరణి వాణి
కర్నూలు

అందరి దగ్గిరా డబ్బువుండి కూడా, వున్న డబ్బు సరిపోక పోవడం 'ఇన్ ఫ్లేషన్' అని పిలువ బడుతుంది.

—కాఫిన్

# ప్రాచీన సాహితి

శతభిషగాడ్యుడున్ సతత శంభువతంసముడయ్యు నోషధీ
తతులకు నాథుడయ్యును సుధారస సేవధియయ్యు దారకా
పతి తన రాజయక్ష్మ భవ బాధల బాపగ నోపడక్కటా
హతవిధికృత్య మెవ్వనికినైన జగంబున దాట వచ్చునే ?

—భర్తృహరి



ఇంద్రియంబుల కంద డెల్ల భూతంబులు
దెగినను దెగకుండ త్రిగుణ రహితు
డఖిలంబునకు నాత్మయన సర్వసాక్షి నా
నజుడని నిష్కలుండన వెలుంగు
క్షేత్రజ్ఞుడాతండు జీవుండు వాసుదే
వుండును సంకర్షణుండు జూవె
వారు మనం బహంకారంబు వరుస బ్ర
ద్యుమ్నా నిరుద్ధ నామోహితము
లింతయును మన్మయంబ మే నిరువదియును
నాల్గునగు తత్వకోటికి నాధు డైన
పంచ వింశ కాభిజ్యుండ బరమ పురుషు
డనియు నా పేరు మఱి పరమ మఱయ లేదు.

—తిక్కన 'మహాభారతం'



అగణిత జన్మకర్మ దురితాంబుధిలో బహు దుఃఖ వీచికల్
దెగిపడ నీదలేక జగతీధవ నీ పద భక్తి నావచే
దగిలి తరింపగోరితి బదంపడి నాదు భయంబు మాన్పవే
తగదని చిత్తమం దిడక దాశరథీ కరుణా పయోనిధీ

—దాశరథీ శతకం

# పాత తెలుగు సినిమా రివ్యూలు



## మాధవీ వారి 'పాండవ వనవాసం'

ఇతిహాసముల ద్వారా మానవుడు కాలాను గుణమగు వాస్తవికతలను తెలుసుకుంటాడు. వర్తమాన కాలానికి పనికొచ్చే వినూత్నసత్యాలు ఆ ప్రవాహ ధార నుంచి పొడగతాయి. భారత రామాయణగాధలు భారతీయులకు వెలుగునిచ్చే దీపాలవంటివి. ఆ సారస్వత సాంద్రంలో లభ్యమయే ముత్యాలూ పగడాలూ అసంఖ్యాకములు.... ఈ నిర్మాతలు పాండవ వనవాసగాధను, భీముని (యన్‌టి రామారావు) కథానాయకునిగా, సుయోధనుని (య స్వి రం గా రా వు) ప్రతినాయకునిగా, ఇటు శకుని అటు వాసుదేవుడు రాజ్యతంత్ర కోవిదులుగా, ద్రౌపది (సావిత్రి) కావ్యనాయికగా చిత్రించారు. మయసభలో తనకు జరిగిన పరాభవాగ్ని చల్లారే నిమిత్తం, సుయోధనుడు ధర్మరాజుని మాయా జూదానికి ఆహ్వానించి కపటోపాయంతో వారిని అడవులకు సాగనంపుతాడు. సూర్యుడు ధర్మరాజుకి అక్షయపాత్ర నివ్వడం, దుర్వాసులవారు తన శిష్యబృందంతో రావటం, సౌగంధిక పుష్పం కోసం భీముడు కుబేరుని వద్దకు వెళ్లటం, ఘోషయాత్రానంతరం చిత్రరధునికి పట్టుబడ్డ సుయోధనుని పాండవులు విడిపించి ప్రాణభిక్ష పెట్టడం, మానధనుడైన రారాజు ప్రాయోపవేశ ప్రయత్నం - యిత్యాది రసవత్తర ఘట్టాలతో చివరికి శశిరేఖ అభిమన్యుల వివాహంతో చిత్రం ముగుస్తుంది. ....సుయోధనునిగా యస్వి రంగారావు చూపిన నటనావైదుష్యం అపూర్వము. రాజదర్బారుని మరుపురాని విధంగా చిత్రీకరించారు. సాహిత్యపుష్టితో, సరస వచోరీతులతో, చక్కటి సంభాషణలతో కథ నడిచింది. ఘోష యాత్రలోను, రాజదర్బారు లోను చూపించిన నృత్యాలు అతికించినట్టు వున్నాయే తప్ప కథా సంవిధానంలో యిమడటం లేదు. దర్శకులు కమలాకర కామేశ్వర రావు ఈ చిత్రానికి కావ్యలక్షణం సమకూర్చారు. రాజ్యము వీరభోజ్యమని నమ్మిన సుయోధనుడు ప్రజ్ఞావంతుడు. అయితే కార్యసాధనకు ప్రజ్ఞ ఒక్కటీ చాలదు; ప్రజ్ఞకు, ప్రతిభకు తోడుగా అనిర్వచనీయమైన అదృశ్య శక్తి అనుకూలించాలి. ఆ అతిలోకశక్తే జయాప జయాలు నిర్ణయిస్తుంది - అంటాడు రారాజు.

యన్నార్ చందూర్ సమీక్ష
'జ గ తి' - ఫిబ్రవరి 1965

# వెన్నె కెరటాలు

## సత్యమూర్తి

పుదుక్కోట సంస్థానంలోని తిరుమాయ్యం గ్రామంలో 1887 ఆగస్టు 19 తేదీన జన్మించి, బి. ఎల్. పట్టా సంపాదించి కూడా న్యాయవాది వృత్తి చేయనొల్లక, మహాత్మా గాంధి వ్యక్తిత్వంచే ఆకర్షితుడై దేశ రాజకీయ రంగంలోకి ప్రవేశించాడు సత్యమూర్తి. .... భారత జాతీయ కాంగ్రెసు తరపున ఇంగ్లండు దేశానికి 1919 లో, అటు తర్వాత మళ్ళీ 1925 లో పంపబడ్డ ప్రతినిధి వర్గాలలో సత్యమూర్తి సభ్యుడై వుండి, అక్కడ అనేక వేదికల నుండి ప్రసంగించి, భారతీయుల స్వాతంత్ర్య కాంక్షకు ఆచరణపూర్వకమైన రూపమివ్వడమే బ్రిటిష్‌వారిపై కాంగ్రెసు పోరాటంలోని లక్ష్యమని ఇంగ్లీషువారికి విడమరచి చెప్పారు.... 1941లో మద్రాసు మునిసిపల్ కార్పొరేషన్ మేయర్‌గా ఎన్నుకోబడ్డారు. మద్రాసు, అన్నామలై విశ్వవిద్యాలయాల సెనేట్ సమావేశాలలో పాల్గొని విద్యాప్రమాణాలను పెంపొందింపజేశారు. లలిత కళల యందు మంచి అభినివేశం చూపారు. మద్రాసు మ్యూజిక్ అకాడమీకి ఉపాధ్యక్షులుగా పనిచేశారు. ఈవిధంగా ప్రజాసేవకుడుగా, స్వాతంత్ర్య సమరయోధుడుగా జాతికి సేవచేస్తూ దేశానికి స్వాతంత్ర్యం రాకపూర్వమే క్విట్టిండియా ఉద్యమం కారణంగా డిటెన్యూగా వుండే 1943 మార్చి 20 తేదీన అనారోగ్యం వల్ల కాలధర్మం చెందారు. సత్యమూర్తి మరొకందుకు కూడా స్మరించవలసిన మహనీయుడు. కామరాజు నాడార్‌ను తమిళనాడు రాజకీయ రంగంలోకి తెచ్చినది ఆయనే.

—డి రామలింగం
'యోజన'లో

## తెలుగు సినిమా

ఆడవాళ్ళు మగాళ్ళలా నటించడం విడ్డూరంగా వుండేది. నేటి ప్రతి హీరో డాన్సులు, స్టెప్పులు, పూలచొక్కాలు వేసి ఆడంగి చేష్టలు చేయడం విడ్డూరంగా లేదా? ఎందుకంటే సిగ్గు పిక్కబలంతో పారిపోయింది. ఎంత ఆడతనంగా నటిస్తే అంత గొప్ప హీరో, ఎన్ని బూతులు వాగితే అంత హాస్యరసం, ఎన్ని కష్టాలు వుంటే అంత ఏడుపు ఏడ్చే ఆడ ప్రేక్షకులు. వీళ్ళా-మన సినిమాల ఆర్థిక నిర్ణేతలు. "అంతిమ తీర్పు"లో డ్యూయట్లు, ఏడ్చే సన్నివేశాలు లేనందునే మహిళామణులను ఆకర్షించ లేకపోయిందని ఓ విమర్శ. ఏం చేయగలం? ప్రజల్లో ఏదో

ఒక వీక్‌నెస్‌ని ఎక్స్‌ప్లాయిట్ చేస్తే అది ఘన విజయం సాధించడమన్నమాట. ఆనాడు జానపదాలు, చారిత్రక వీర గాధలు, పురాణాలు, మాయలు, మంత్రాలు జనరంజకాలు కాగా యీనాడు రంగులూ, దిగంబర వేషం, సెక్సు, హింస జనాదరణ పొందు తున్నాయి. అదేమంటే ఇంగ్లీషు, మళ యాళ చిత్రాలు అలా వుంటే మా చిత్రాల్లో అవి లేకపోతే ఎవరు చూస్తా రని వాదించడం బుకాయించడమే మరి.

—విపంచి
'అనామిక'లో

## వాయని కృష్ణకుమారి

"ఎవ్వరినీ లక్ష్యపెట్టకుండా తన పని తాను చేసుకుపోయే చతురురాలైన గృహిణిలాంటిది కాలం. అది మను ష్యుల్ని తనతో లాక్కుపోతుంది" అన్న కృష్ణకుమారి మాటల్లో స్వీయ వ్యక్తిత్వం అద్దంలో కొండలాగ కని పిస్తుంది. 'అగ్నిపుత్రి'లోని పాతికకు పైగా కవితల్లో మనసు చిలకలు, నిత్య దుఃఖితులు, మట్టి మనుష్యులు, కావేరి కన్నీటి పాటలు, సుప్త వేదనలు కని పిస్తాయి. "కాలాతీత వ్యక్తులు" నవలా రచయిత్రి డాక్టర్ శ్రీదేవి చనిపోయి నప్పుడు కృష్ణకుమారి రాసిన స్మృతి కవిత మనకున్న కొద్దిపాటి గొప్ప ఎలిజీల్లో ఒకటి. కృష్ణకుమారి రచించిన 'కాశ్మీర దీపకళిక' ఈ శతాబ్దంలోని తెలుగు యాత్రా రచనల్లోనే (Travelogue) మొదటిదంటే, తారీ ఖులు దస్తావేజులు తెలిపిన సాహిత్య చరిత్రకారులు ఆశ్చర్యపడరు. ఏనుగుల వీరాస్వామయ్యగారి "కాశీ యాత్ర చరిత్ర", కోలా శేషాచలకవి "నీలగిరి యాత్ర" గత శతాబ్దిలోని చారిత్రక నిధులు. కృష్ణకుమారి ఈ రచనలో స్థలాల, సంఘటనల చరిత్రే కాకుండా అనుభూతుల ఆవిష్కరణ కూడా కని పిస్తుంది.... కృష్ణకుమారి రచించిన 'ఆంధ్రుల కథ' ఆమె చారిత్రక అవ గాహనకు ప్రతీక. ఇది కథలా చదువు కోవడానికి వీలుగా కుతూహల రమ్యంగా వుంటుంది.

—యన్ గోపి
'ఉదయం'లో



జీవితంలోని మధురక్షణాలన్నీ పోగు చేసుకువుంచండి. అవే పెద్ద తనంలో పట్టు పరుపై మెత్తదనం యిస్తాయి.

—టార్కింగ్టన్

మానవుని మెదడు చాలా గొప్పది. పుట్టినప్పట్నుంచీ అది విరామం లేకుండా పని చేస్తూనే వుంటుంది. ఒక్కక్షణం కూడా ఆగదు - వేదికెక్కి ఉపన్యాసమిస్తున్నప్పుడు తప్ప !—

—హాఫ్‌మాన్

నేను కష్టపడి పోరాడాను, నా పోరాటం ముగిసింది. కాని నా విశ్వా సం మాత్రం సడలలేదు.

—బెబిలు

## మానవ ప్రగతి

## 21వ శతాబ్దపు కారు

అమెరికన్ మోటారు కంపెనీల వారు తాము భవిష్యత్తులో రూపొందించనున్న కార్ల నమూనాలను కొన్ని సంవత్సరాలుగా ప్రపంచ వ్యాప్తంగా వివిధ ఆటోమొబైల్ ఎగ్జిబిషన్లలో ప్రదర్శిస్తున్నారు. ఇప్పుడు మనం చూస్తూన్న కార్లకు భిన్నంగా ఎంతో ఆసక్తికరంగా, ఆశ్చర్యకరంగా కనిపించే ఈ 21వ। శతాబ్దపు కార్ల నమూనాలను ఇంజనీర్లు కొత్త కొత్త ఇంజనీరింగ్ ప్రక్రియలతో తయారుచేశారు. వీటిలో 'జనరల్ మోటార్స్' కంపెనీ వారు రూపొందించిన చెవ్రొలెట్ ఎక్స్ ప్రెస్ కారు గంటకు 240 కిలోమీటర్ల వేగంతో ప్రయాణించగలుగుతుంది. ఈ కారు వినియోగంలోకివస్తే దగ్గర దగ్గరగా వున్న నగరాలమధ్య విమాన ప్రయాణానికి బదులుగా కారు ప్రయాణంతో సరిపెట్టుకోవచ్చునని భావిస్తున్నారు. అమెరికాలోని మోటారు వాహనాల కంపెనీకలనిట్నిలో అతి పెద్దదైన జనరల్ మోటార్స్ కంపెనీ తయారు చేసిన మరొక నమూనా కారు - 'పోంటియాక్ పర్స్యూట్' నలుగురు ప్రయాణించడానికి వీలుగా, ఒక 'కూపీ' లాగా వుంటుంది. నాలుగు చక్రాలకు అనుసంధానించివుండే 'ఎలక్ట్రానిక్ స్టీరింగ్' ని కలిగివుండే ఈ 'పోంటియాక్' ని పూర్తిగా 'వచ్చే శతాబ్దపు ఆలోచన' అనదగిన స్టీలు, ప్లాస్టిక్, సెరామిక్స్‌తో తయారు చేశారు. అమెరికన్ ఆటోమోబైల్ పరిశ్రమ నుంచి గత 40 ఏళ్లలో సుమారు 100 కి పైగా ఇట్టి అత్యాధునిక నమూనా కార్లు తయారయ్యాయి. ఇవన్నీ కూడా అమెరికన్ ఇంజనీర్ల ప్రతిభకు, సృజనాత్మక శక్తికి అద్దం పట్టాయి. 'ఫోర్డ సీటిల్ - ఐట్ 21' మోడల్ కారును మొత్తం ఆరు చక్రాలతో తయారు చేశారు. ఈ కారుకి వెనుక రెండు చక్రాలుంటే, ముందు నాలుగు చక్రాలుంటాయి! దీనికి స్టీరింగు చక్రం వుండదు; ఆ స్థానంలో ఒక స్టీరింగ్ డయల్' వుంటుంది. అందులోని మీటల్ని వ్రేలితో నొక్కుతుంటే సరిపోతుంది. వాతావరణ వివరాలను, ఇంకా గమ్యానికి చేరుకునే సమయాన్ని తెలియజేసే కంప్యూటర్

తెరకూడా ఈ కారులో వుంటుంది. కాగా, 'కాడిలాక్ సైక్లోన్' అనే మరొక నమూనా కారులో అయితే ఏకంగా ఒక 'రాడార్' నే అమర్చే శారు. ఫోర్డ్ కంపెనీ తయారు చేసిన ఇంకొక నమూనా కారు గురించి వింటే మన ఆశ్చర్యం రెట్టింపవుతుంది. ఈ కారు, డ్రయివర్ మాటల్ని అర్థం చేసుకుని అతడి ఆజ్ఞల్ని శిరసావహిస్తుంది, డ్రయివర్ నోటితో చేసే సూచనలను ఇందలి ఎలెక్ట్రానిక్ వ్యవస్థ అర్థం చేసుకుని - డిక్కీ తెరవమంటే తెరవడం, లైట్లు వెయ్యమంటే వెయ్యడం, తియ్యమంటే తియ్యడం, డోర్లు తాళం వెయ్యమంటే వెయ్యడం, తాళం తియ్యమంటే తియ్యడం చేస్తుంది. అంతే కాదు, డ్రయివర్ చాలా దూరంలో నిలబడి వుండే ఈ కారు ఇంజన్‌ని 'స్టార్ట్' కావలసిందిగా ఆజ్ఞాపించవచ్చుకూడా.

## రాగి

పూర్వపు రోజులలో ఇళ్లలో ఉపయోగించే పాత్ర సామగ్రిలో రాగి పాత్రలు అధికంగా ఉండేవి. అయితే ఇటీవల రాగి పాత్రల వాడకం తగ్గిపోవడమే కాదు. దాదాపు అంతరించిందనే చెప్పాలి. రాగి ఖరీదు బాగా పెరగడం, అది బరువైనది కావడం దీనికి ప్రధాన కారణం. అంతేకాక రాగికంటే చౌకగ లభించే అల్యూమినం, స్టెయిన్‌లెస్ స్టీల్, కంచు పాత్రలు వాడకంలోకి రావడం కూడా ఈ పరిణామానికి కారణం. గృహోపకరణాలకు రాగి వాడుక మరిచిపోవడం ఒక విధంగా మంచిదే అయింది. ఇది చాలా కీలకమైన లోహమేకాక, దానికి గల ప్రత్యేక లక్షణాలవల్ల ఎలక్ట్రికల్, ఎలక్ట్రానిక్, కమ్యూనికేషన్ పరిశ్రమలకు అత్యంత అవసరమైన ముడి పదార్థంగా రూపొందింది. అయితే రాగికి ఉన్న ప్రత్యేక లక్షణాలు గల ఇతర లోహాలు లేకపోలేదు. బంగారం, ప్లాటినం వంటి లోహాలకు కూడా రాగికి ఉన్న ప్రత్యేక లక్షణాలే ఉన్నా ఆ లోహాలు బాగా ఖరీదైనవి కావడంవల్ల రాగికి ప్రాధాన్యం హెచ్చి, అనేక పరిశ్రమలలో అది కీలకమైన ముడి పదార్థంగా రూపొందింది. 1947 లో బ్రిటిష్ వారు మన దేశాన్నుంచి నిష్క్రమించినప్పటికి రాగి ఉత్పత్తి పరిమితంగా ఉండేది. ఇండియన్ కాపర్ కార్పొరేషన్ అన్న ఒకే ఒక కంపెనీ బీహార్ లోని సింగభూమ్ జిల్లాలో మోసాబొని గనుల నుంచి ఖనిజం త్రవ్వి, ఏటా ఆరు వేల టన్నుల రాగిని ఉత్పత్తి చేసేది. అయితే ఆ తరువాత స్వతంత్ర భారత ప్రభుత్వ కృషి ఫలితంగా రాగి ఉత్పత్తి 1986-87లో 51 వేల టన్నులకు పెరిగినా దీనికి తోడు రాగి వాడకాన్ని తగ్గించడానికి ప్రత్యామ్నాయ లోహాలను వాడుక చేయడం కూడా విస్తృతంగా జరుగుతోంది. అయినా మన అవసరాలు తీరక 51 వేల టన్నుల రాగిని 86 - 87 లో దిగుమతి చేసుకోవలసి వచ్చింది. నిక్షేపాలలో 46 శాతం బీహార్‌లోనూ,

25 శాతం మధ్య ప్రదేశ్‌లోనూ, 20 శాతం రాజస్థాన్‌లోనూ ఉన్నాయి. సుమారు 74 గనులలో 566 మిలియన్ టన్నుల రాగి ఖనిజం, దాని నుంచి సుమారు అరున్నర మిలియన్ టన్నుల రాగి లభించగలదని 1983 లో అంచనా వేశారు. సింగ్ భూమ్ జిల్లాలోని మోసాబని గనులలో నెలసరి ఖనిజం త్రవ్వకం 55 వేల టన్నుల నుంచి 88 వేల టన్నులకు పెరిగింది. ఈ ఖనిజం నుంచి రాగితోపాటుగా లభించే ఇతర లోహాలను కరిగించడానికి కూడా ఏర్పాట్లు జరిగాయి. మధ్యప్రదేశ్‌లోని మలంజ్ ఖండ్ ప్రాజెక్టుకు 1982 లో ప్రారంభోత్సవం జరిగింది. ఇది ఏటా 20 వేల లక్షల టన్నుల ముడి ఖనిజాన్ని, 23 వేల టన్నుల రాగిని ఉత్పత్తి చేస్తుంది. రాగికి బదులు ప్రత్యామ్నాయ లోహాల వాడకాన్ని ఎంత ప్రోత్సహించినా, కీలక రంగాలలో రాగి అవసరం పెరుగుతూనే ఉంది. గిరాకీ ఏటా మూడు శాతం పెరుగుతూ ఉండగలదని అంచనా. మలంజ్‌ఖండ్, సింగ్‌భూమ్ వంటి భారీ నిక్షేపాలు ఇతరత్రా బయట పడితే తప్ప మన అవసరాలలో సగ భాగాన్ని కూడా దేశీయ ఉత్పత్తితో తీర్చుకోనలేము.

## 'నాగ మండల'

సుప్రసిద్ధ నటుడు నాటక కర్త అయిన గిరీష్ కర్నాడ్ స్వంత దర్శకత్వంలో 'నాగమండల' అనే నాటకాన్ని ఈమధ్య అమెరికా షికాగో నగర విశ్వవిద్యాలయం విద్యార్థులు ప్రదర్శించారు. ఇది తన 'వరల్డ్ ప్రీమియర్' ని అమెరికాలో జరుపుకున్న మొట్టమొదటి భారతీయ నాటకం కావడం గమనార్హమైన విశేషము .... షికాగో యూనివర్శిటీలో 'విజిటింగ్ ప్రొఫెసర్'గా తొమ్మిది మాసాల పాటు గడిపిన సమయంలో, గిరీష్ కర్నాడ్ ఈ నాటకాన్ని రచించి, దర్శకత్వం వహించారు. ప్రముఖ కన్నడ నాటక రచయిత అయిన గిరీష్ కర్నాడ్ ప్రస్తుతం భారత సంగీత నాటక అకాడమీ అధ్యక్షునిగా వున్నారు. ఆయనకు గత ఏడాది అక్టోబరులో ఫుల్ బ్రయిట్ స్కాలర్‌షిప్ లభించడంతో అమెరికా వెళ్లారు. తాము అమెరికాలో వున్న సమయంలో భారతీయ నాటక రంగానికి సంబంధించిన వివిధ అంశాలను గురించి అక్కడ బోధించినట్లు కర్నాడ్ ఇటీవల న్యూఢిల్లీలో ఒక ఇంటర్వ్యూలో తెలియజేశారు. 'నాగమండల' నాటకాన్ని గిరీష్ కర్నాడ్ ఒక జానపద గాథ ఆధారంగా రచించారు. ఇందులోని ప్రధానపాత్ర లన్నింటిని అమెరికన్

## నెహ్రూ వాణి

అనురాగం, అప్యాయత హృదయానికి చెందినవి - వాటిని బజారులో కొనలేరు ; బలప్రయోగంతో ఎంత మాత్రం పొందలేరు.

1922 మే 17

విద్యార్థులే పోషించారని, భారతీయ జానపదగాథ అమెరికన్ల నటనతో ప్రాణం పోసుకోవడం తమకు ఆనం దానుభూతి నిచ్చిందనీ కర్నాడ్ పేర్కొన్నారు. కర్నాడ్ రచించిన 'హిట్టిన హుంజ' లాంటి కొన్ని నాటకాలలో జానపద జాతీయాలు విస్తృతంగా కనిపిస్తాయి. కాగా 'హయవదన' అనే కర్నాడ్ నాటకం సమకాలీన నాటక రంగంలో ఒక మైలురాయి లాంటిది. ఈ నాటకానికి ప్రేరణ ప్రాచీన 'కథా సరిత్సాగరం' లోని గాథ అయినప్పటికీ ఇందులో అధునికత పుష్కలంగా వుంటుంది. "నాగమండల" నాటకం గిరీష్ కర్నాడ్ వ్రాసిన ఫుల్ లెన్త్ నాటకాలలో ఆరవది. గతంలో 'రోడ్స్ స్కాలర్' కూడా అయిన కర్నాడ్ ఆక్స్‌ఫర్డ్ నుంచి ఫిలాసఫీ, పొలిటికల్ ఎకానమీలలో మాస్టర్స్ డిగ్రీలను పొందారు. ఆయన అనేక చలన చిత్రాలకు రచన, నటన, దర్శకత్వం బాధ్యతలను నిర్వర్తించారు. ఆయన దర్శకత్వంలో రూపొందిన మొదటి రెండు చిత్రాలైన 'వంశవృక్ష', 'కాడు' ఉత్తమ దర్శకత్వానికై జాతీయ అవార్డులను ('వంశవృక్ష' కి కర్నాడ్ సహ దర్శకుడుగా వున్నారు). అమెరికాలో 'నాగమండల' నాటకాన్ని రూపొందించడంలో కర్నాడ్‌కి అమెరికన్ నాటక ప్రయోక్త గ్వెండోలిన్ సహకరించారు; కర్నాడ్ వ్రాసిన 'హయవదన' నాటకానికి 10 ఏళ్ల క్రితం దర్శకత్వం వహించారు.







# కొత్త పుస్తకాలు

'ఈ నగరం జాబిల్లి' - రచన : గుంటూరు శేషేంద్రశర్మ. పబ్లిషర్స్ : శేషేంద్ర సాహిత్య పీఠము, జ్ఞాన్ బాగ్ పాలెస్, గోషా మహల్, హైదరాబాదు - 500 012 .... వెల : రు. 10-00.

ఉర్దూ సంస్కృతికి పునాది గజల్ - చేతిలోకి వచ్చి వాలే రంగుల పక్షి అది. రెండు రెక్కలూ, ఒక గొంతు - యింతే దాని సంపద. పక్షిని ఎవరైనా చేత్తో పట్టుకుంటే, దాని పిడికెడు శరీరం గుండెకాయగా మారి, స్పందిస్తూ వుంటుంది ; చంచల నేత్రాలు నలుదిశలా చూస్తూ వుంటాయి. పొదివి ముద్దుపెట్టుకోవాలనే కోరికతోబాటు, దానిని ఆకాశంలోకి వొదిలేయాలనే భావం కూడా కలుగుతుంది.

హృదయజ్ఞత గల వారికి అంత నాజూకైనది గజల్. అంతే కాదు, దాని గొంతుకకున్నది మువ్వ కాదు - పువ్వు - పాడే పువ్వు.

గజల్లో రెండేసి పాదాల ద్విపదలు - అంటే కప్లెట్స్ - ఏడెనిమిది వుంటాయి. పాదాన్ని 'మిస్రా' అనీ, ఒక్కొక్క ద్విపదని 'షేర్' అనీ అంటారు. అడవిలోని లేడికి అకస్మాత్తుగా పులి ఎదురైనప్పుడు, ఆ లేడి నోట వెంట తటాల్న వచ్చే శబ్దాన్ని గజల్‌గా పేర్కొన్నారు తత్త్వజ్ఞులు. ఇస్లామ్ మతంలో 'మూర్తి' స్థానంలో 'ప్రణయిని' అవతరించింది. మోహపాశంతో ప్రజలని తన వైపు ఆకట్టుకుంటాడు ఉర్దూకవి 'గజల్' అనే ప్రక్రియలో.

దక్కన్ పశ్చిమాకాశం పూచే గులాబీ సంధ్యల్లో నాలుగు బాహువులెత్తి మనల్ని పిలుస్తున్న ప్రేమ చిహ్నమట చార్మినార్. ఉత్తర భారతం ఖడ్గ సమూహాల సంఘర్ష ధ్వనుల యుద్ధ కోలాహలమైతే, దక్కన్ పీఠభూమిని చాందినీరాత్రుల 'సితార్ సారంగీల' ప్రణయ మందిరంగా చేసుకుందట హిందూస్తాన్. అక్బరు చక్రవర్తి సమకాలికుడైన గోలకొండ నవాబుల కులీ కుతుబ్‌షా, భాగ్యతి అనే హైందవ యువతిని ప్రేమించి పెళ్లి చేసుకు, ఆమె పేర కట్టించిన హైదర్‌మహల్ కారణంగా ఆ పట్నం హైదరాబాద్ అయింది.

'గులాబీలు వీధుల్లో గుస గుసలాడే చోటు - మధుశాలలు మశీదులు మనసును చీల్చే చోటు.... ఈ నగరం జాబిల్లి - దక్కను ప్రేమా గల్లీ'....

వేదోపనిషత్తులు, పురాణేతి హాసాలు మొదలైన ప్రాచీన వాఙ్మయమంతా లయాన్వితమై ఛందోబద్ధముగా వుండటానికి ప్రధాన కారణం అది శాబ్దిక రూపాన తరతరాల ప్రజలలో జీవించాలని! శ్లోకమూ పద్యమూ జ్ఞాపకం ఉన్నట్టుగా వచనం జ్ఞాపకం వుండదు కదా! ఒకనాడు వచనం వాణిజ్యానికి మాత్రమే పరిమితమై ఉండేది. సాహితీపరులను సాహిత్యాభిమానులకు - గజల్ గురించి వివరించి చెబుతూ సాహిత్యమధనంతో బాటు ఎన్నో అపూర్వ విషయాలు తెలిపారు గుంటూరు శేషేంద్ర శర్మ.

* * *

'అభివందనం' - దీపావళి ప్రత్యేక సంచిక. సంపాదకులు: కొండ్యాల లక్ష్మీనారాయణ. D1/304 ప్రతాప్ ప్యాలెస్, నవఘర్, వసయి (వెస్ట్). జిల్లా ఠాణా. 401202. ప్రచురణ: రివరెండ్ డి యస్ వాల్టర్స్, మెథోడస్ట్ చర్చ్ ఎన్నెక్స్, న్యూమిల్ రోడ్, కుర్లా, బొంబయి - 400070. కాపీ వెల: రు.4-00.

"స్థూలంగా మహారాష్ట్రలోని తెలుగు వారిని మూడు రకాలుగా విభజించవచ్చు. మొదటి రకం వారు 18వ శతాబ్దం, అంతకి పూర్వం వెళ్లినవారు; రెండవ రకం వారు 18వ శతాబ్దంలో పారిశ్రామిక రంగపు ప్రారంభపు దశలోనూ, ఆ తర్వాతనూ వలస వచ్చినవారు. ఇక మూడవరకం ఉద్యోగ వ్యాపార రీత్యా 20వ శతాబ్దంలో వచ్చినవారు" అంటున్నారు యమ్ ప్రభాకర్.

సైంటిస్టులవే తుస్సుమంటున్నప్పుడు నా రాకెట్‌కి నవ్వుతావా? - అని స్నేహితురాలిని గద్దించే ప్రాథమిక విద్యార్థి, టివి రామాయణ్ చూసేందుకు ఆపరేషన్ మధ్యలో జారుకున్న డాక్టరు, పనేస్తే వచ్చేది పాతికే ఈ వృత్తిలో రోజుకొక వంద చూస్తాననే బిచ్చగాడు, నా కథలిక తిరగొడితే జాగ్రత్త - అని ఎడిటర్ రూమ్‌లోకి గూండాని పట్టుకొచ్చిన రచయిత - యిటువంటి కార్టూనులు ఈ సంచిక నలంకరిస్తున్నాయి.

మగవాడు గనక విజయ్ తన తొందరబాటు సరి దిద్దుకునేందుకు వెనక్కి వెళ్లిపోతాడు. కాని, అతన్నే నమ్ముకు, అతనితోనే తన జీవితమనుకున్న స్వాతి వెనక్కి వెళ్లలేదు. ఉరి పోసుకోకుండా కాపాడిన ఎదురింటావిడ, ఈ అమాయకురాల్ని వేశ్యా వ్యాపారులకి అమ్మడంతో, కాలేజీ స్టూడెంట్ స్వాతి అంగడి బొమ్మగా అధోగతి పాలవుతుంది - పి నీరజ రచించిన 'తొందరబాటు' కథానికలో.

రామాసాగరం పరమేశ్వర్ వ్రాసిన 'తేలు కుట్టిన దొంగ' యడ్వంచర్‌ని ఆశించే యువకులకు కనువిప్పు కలిగించేదిలా ఉంది ఎల్లప్ప, ఉదయ్, పవన్, రాఘవులు, కావలిపాటి విజయలక్ష్మి, సుధ, సునంద, శేషగిరిరావు, ఆనందభారతి మున్నగువారి రచనలు వున్నాయి ఈ సంచికలో.

ఇందరి పేర్లు చెప్పి, ఒకరి పేరు చెప్పలేదు. ఎంచేతనంటే, 'డెస్సర్ట్' విందులో చివరి అయిటమ్ గనక! 'అభివందనం'లోని రచనలన్నిటిలోకీ తలమానిక మన దగినది తురగా జయ శ్యామల 'అమ్మో ఆదివారం....' ....కాలింగ్ బెల్లూ, ఫోన్ బెల్లూ పంతాలేసుకొన్నట్లు మ్రోగగా, ఫోన్‌లో వారికి 'వన్‌మినిట్' అని చెప్పి, ముందు కొచ్చి తలుపు తెరవగా, కీచుగొంతుతో, ఫినాయిల్ అమ్మే సేల్స్‌గరల్; ఏడాదికి సరిపడ్డ ఫినాయిల్ ఇంట్లో వుందని చెప్పి ఆమెని సాగనంపి, ఫోన్ తీసుకొనే సరికి శ్రీవారు, 'భాటియాఫామిలీ రేపు మనింటికి వస్తామన్నారు - లంచ్‌కే రమ్మన్నాను'- అని చల్లగా చెబుతాడు. ఈలోగా ఉప్మా మాడిపోవటం, ముగ్గురు పిల్లలని ఆడుకొనేందుకు పంపి, అతిథుల కోసం బజారుకెళ్లి కూరలు తెచ్చుకొనే హడావిడిలో 'లాచ్'కీ పర్సులో వేసుకోకుండా మూయడంతో, వాచ్‌మాన్ టెరస్ మీదుగా బాల్కనీలోకి వచ్చి, అక్కడి గ్లాస్ తలుపు బద్దలుకొట్టి లోని కొచ్చి తలుపు తెరవటం, మర్నాడు ఆ వచ్చిన భాటియా కుటుంబం భోజనాలు చేసి వెళ్లక, టివిలో బెంగాలీ సినిమా అయాక కాఫీలు సేవించి వెళ్లటం, కాళ్లు పీక్కుపోతూండగా నడుంవాల్చి నాలుగు నిముషాలు కాకుండానే కుసుమా శ్రీనివాసుల రాక, వాళ్లకి మళ్లీ కాఫీ టిఫినులూ, కిచెన్‌లో సింక్ నిండా అంటుగిన్నెలు, కంచాలు; డ్రాయింగ్ రూమ్‌లో కప్పులూ ప్లేట్లూ; బాత్‌రూమ్ బకెట్లలో తడిపి వుంచిన బట్టలు, రాత్రి పదకొండు గంటలకి అలిసి సొలిసి పక్కమీద పడి 'హమ్మయ్య - మళ్లీ ఆరురోజుల దాకా ఆదివారం రాదు కదా!' - అనుకొనే అనూరాదలో మెట్రొపాలిటన్ సిటీస్‌లోని మధ్య తరగతి మహిళ మనకి సాక్షాత్కరిస్తుంది. అన్ని వసతులూ వుంటాయి; ఆర్థికమైన యిబ్బందులు వుండవు. కాని, తన యిల్లు, తన భర్త, తన పిల్లలు కోసం పడే ఆ శారీరక శ్రమని, మానసిక వొత్తిడులను అంచనా వేయగలవారెవరు? ఎంతోవాస్తవికంగా చిత్రించారు అనూరాధని తురగా జయశ్యామల.

కొండ్యాల లక్ష్మీనారాయణ వెలువరిస్తున్న 'అభినందనం' బొంబాయి ఆంధ్రుల సారస్వత సాంస్కృతిక వేదిక కాగలదని ఆశిస్తున్నాము.

—క్షీరసాగరమ్

అండమాన్ కలాలు; కవితా సంకలనం; ప్రచురణ: అండమాన్ తెలుగు సాహితీ సమితి, కె. 34, ఆకాశవాణి కాలనీ, పోర్ట్ బ్లెయిర్ - 744102, అండమాన్స్. వెల: రు. 5-00.

ఈ కవితా సంకలనంలోని తొలి పలుకు ద్వారా అండమాన్, నికోబార్ దీవుల్లో సుమారు ముప్పయి వేలమంది తెలుగువారు నివసిస్తున్నట్లు తెలుస్తున్నది. సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించే ఆంధ్రా అసోసియేషన్ వున్నది. సాహిత్యాభిమానులకు సాహితీ

సమితి ఏర్పడింది. పోర్ట్ బ్లెయిర్‌లోని ముద్రణాలయంలోనే యీ పుస్తకం అచ్చు అవడంకూడా ఒక విశేషం.

ఈ సంకలనంలో కవితలు అందిచ్చిన వై. నీలకంఠరావు, యం. రాధా రుక్మిణి, డి. వాసుదేవు, పి. కృష్ణమ రాజు ఉపాధ్యాయులుగా అండమాన్ దీవుల్లోనే పనిచేస్తున్నారు. యస్. వి. ప్రసాద్ ఆకాశవాణి వుద్యోగి. వీరందరిలో తెలుగుభాషపై ప్రేమా, తెలుగు సాహిత్యానికి సేవ చేయాలనే అభిలాషా, వుత్సాహం వుండటం మెచ్చుకో దగినవి.

రవళి (కవితా సంకలనం) రచన: మన్నవ విద్యాధరి; ప్రచురణ: తెలుగు సాహితి, ఇ. ఎ. 124 - 2 టాగోర్ గార్డెన్, న్యూఢిల్లీ - 110027.... వెల: రు. 5-00.

దేశ పరిసితుల మీదా, స్త్రీల దుస్థితి గురించీ విద్యాధరిలో అశాంతీ, ఆవేదన వున్నాయి. వాటి ఫలితమే యీ కవితల ఆవిర్భావం. "సలసల మరిగే రుధిరపు భీకరపరిణామాన్ని" అని ఆమె వర్ణించినా విప్లవం రక్తపాతం ద్వారా జరగాలని అభిలషిస్తున్నట్లు కన్పించదు.

దేశ నాయకుల విదేశాల షికార్లు, మధ్య తరగతి మనిషి సరదా ప్రయాణాలతో పోలుస్తూ, 'కావాలి ప్రజలు కాం తా లు' లో వ్యంగ్యంగా విమర్శిస్తారు. పిల్లలకు బూచాడిని చూపి భయపెట్టినట్లు శత్రుప్రమాదం అనే బెదురుతో ప్రజలను అణచాలని ప్రభుత్వం ప్రయత్నిస్తున్నదని చమత్కారంగా చెప్పారు యింకో కవితలో.

"నాకల నిజమైతే"లో ఆలయాలు, మసీదులు, గురుద్వారాలు లేని దేశమే 'స్వర్గం' అన్నా, కవయిత్రికి మానవుడి బాధలకి పరిష్కారం దైవమే చూపుతాడనే విశ్వాసం వున్నదని కొన్ని కవితల్లో స్పష్టమవుతూంది.

"జీవితాన్ని మెరుగు పరుచుకోవాలన్న ఆంకాక్ష మనిషిని ఎన్నడూ విడిచి పెట్టదు" అన్నారు ఏల్చూరి సుబ్రహ్మణ్యం పరిచయ వాక్యాలలో. ఈ కవయిత్రి ఆశయంకూడా అక్షరాలా అదే. దేశంలో మనుష్యుల్లో వుత్తమ విలువలు నెల కొనాలన్నదే విద్యాధరి కోరిక.

*

కుటుంబరావు సాహిత్యం (రెండవ సంపుటం); సంపాదకుడు: కేతు విశ్వనాధరెడ్డి; ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌవుస్, 4 - 1 - 435, విజ్ఞాన భవన్, బ్యాంకు స్ట్రీటు, హైదరాబాదు - 500 001; వెల: రు. 40-00.

అప్పటి వరకూ పొట్టలో చల్ల కదలకుండా కూర్చున్న మధ్యతరగతి కుటుంబాల్లో, సుమారుగా యీ శతాబ్దపు యిరవయి, ముప్ఫయిల నుండీ గొప్ప మార్పులు రానారంభించాయి. యువకులు చదువులకోసం నగరాలకు వలస పోవడం ప్రారంభమైంది. ఆ తరువాత వుద్యోగాలు, వారి వెనకే

వారి కుటుంబాలు, కొద్దో గొప్పో గ్రామాల్లో వున్న ఆస్తులు అమ్ముకొని నగరాల్లో స్థిరనివాసానికి వచ్చేశారు. మెలి మెల్లగా ఆడపిల్లలూ గడపదాటి బయటికి వచ్చి ప్రపంచాన్ని వీక్షించడం మొదలయింది.

రెండవ ప్రపంచ యుద్ధం జరిగింది. ఆర్థికమాంద్యం. ఆర్థికమైన ఒడిదుడుకుల వల్ల మనుష్యుల్లో వచ్చిన మార్పులూతో, డబ్బు ఆవశ్యకత ఆరంభమయింది; వెను వెంటనే డబ్బుకి యిచ్చే విలువా ఎక్కువయింది.

ఇంకో ప్రక్కన దేశమంతటా జాతీయోద్యమం కొనసాగుతున్నది. వార్తా పత్రికలూ, సాహిత్య పత్రికలూ స్థాపించడంతో అవి చదవడం వాటిలో రాయడం కూడా ప్రజలను విపరీతంగా ప్రభావితం చేసింది. సినిమా పరిశ్రమ మొదలయి ఎందరినో ఆకర్షించింది. శలభాల్లాగా మాడి, సినిమా మాడియంని అర్థంచేసుకున్నా, వెలిగింది, వ్యాపార మెళకువలు తెలిసిన వారే. నాటక ప్రదర్శనలూ కొంత కాలం ముమ్మరంగా సాగాయి.

ఇవన్నీ తెలుగుదేశపు చదువుకున్న యువకుల జీవితాలను కదలించి వేశాయి. సాంఘిక విలువలను ఒక వూపు వూపాయి. ఈ అన్ని రంగాల తోనూ కొడవటిగంటి కుటుంబరావుకి సన్నిహిత బాంధవ్యం వున్నది. సాహిత్య శిల్పం గురించి, సాహిత్య ప్రయోజనం గురించి గాఢమైన విశ్వాసాలున్నాయి. ఇంకొక వైపున సంప్రదాయ సాహిత్యం జీర్ణం చేసుకున్న అనుభవమూ, నవ్య ప్రపంచ ఆవిష్కారానికి కొన్ని గట్టి సిద్ధాంతాలూ వున్నాయి. అయితే యీ సిద్ధాంతాలను తన రచనల్లో ప్రచారం చేయడానికి ప్రయత్నించకపోవడం కుటుంబరావు రచనా శిల్పంలోని వైశిష్ట్యం! సమాజాన్ని, వ్యక్తులనూ, అన్యాయాలూ, అసమానతలూ, కృత్రిమత్వమూ, కుళ్ళూ అన్నీ వాస్తవిక ధోరిణిలో ఆవేశ రహితంగా పాఠకుల ముందు పెడతారు. పాఠకులలో తను కోరిన దృక్పథాన్ని కలుగుజేస్తారు. అయితే 'మాస్టి' అన్నట్లు పాఠకులలో ఆ స్థాయికి తగిన పరిణతి వుండాలి. లేకపోతే, "చిత్రించిన జీవితంలోని సంఘర్షణలకూ పరిస్థితులకూ అనుగుణంగా పాత్రల స్వభావ పరివర్తన ఎట్లా జరుగుతూ పోయిందో మనం గమనించకపోతే.... ఆయన పాఠకుల్లో కలిగించాలనుకున్న ప్రాపంచిక దృక్పథం పట్లా మనకు సరైన సంస్కారంఏర్పడదు" (కేతు విశ్వనాథరెడ్డి). "ఆయనలోని చారిత్రక ఆశావాదం మనకు సంపూర్ణంగా అర్థం కాదు" (కే. వి)

ఈ సంపుటిలో అరుణోదయం, జీవితం, గడురోజులు అనే మూడు నవలలూ, 20 కి పైగా కథలూ, 20 కి పైగా గల్పికలూ, ఒక నాటిక వున్నాయి. ఇవన్నీ చదివాక కేతు విశ్వనాథరెడ్డిగారి భూమిక, మొదటి పేజీలోనే వున్న పాలగుమ్మి పద్మరాజు, కుటుంబరావుల సాహిత్యచర్చ

చదువుతే పఠితకు ఒక సమగ్రమైన అవగాహన కలుగుతుంది.

మధ్యతరగతి జీవితాలలో వుండే వైరుధ్యాలకు సంపూర్ణమైన ప్రతినిధులు 'అరుణోదయం' లో రామ్మూర్తి, 'జీవితం' లో ప్రకాశం, 'సాంఘిక దురన్యాయాన్ని చూసీ చూడనట్టు నటించడం', తెలియని ఆదర్శాలున్న మార్కండేయులు 'వ్యర్థజీవితం'లో 'ఈ జీవితం ఇట్లా ఎందుకయినట్లు' అని ప్రశ్నించడం, ఒక రకం విషాదమవుతే; తెలివి తక్కువవాడు తన మంచితనంతో ఏ ప్రయోజనమూ సాధించలేకపోవడం 'పెళ్ళినాడిచ్చిన కట్నం' కథలో మరొకరకం విషాదంగా చిత్రిత మవుతుంది.

ప్రపంచం మారనంతవరకు వ్యక్తి ఆదర్శాలు, ఔన్నత్యం కాపాడుకోవడంలో దెబ్బలు తింటూనే వుంటాడనే సత్యం చిత్రించడంలో, స్త్రీ పురుష భేదం చూపించరు కుటుంబరావు. "గడ్డు రోజులు"లో హైమవతి "మన్నుతిన్న పాములా వుండటం నా అసలు స్వభావము కాదు. ఈ స్వభావాన్ని తెచ్చి పెట్టుకున్నాను. నాలో అగ్ని పర్వతాలున్నై. నేనుమగవాణ్ణయి పుట్టి వుంటే నాకు పట్టపగ్గాలుండేవి కావేమో!" అని స్పష్టంగా చెపుతుంది. "గడ్డు రోజులు" లోనే జానకి తల్లిగా, భార్యగా, కూతురుగా తన స్థానం పరిరక్షించుకోవడం కోసం పడే యాతనా, సర్దుకుపోవడం స్త్రీని కించపరచడానికి కాదు, ఆలోచింపజేసి జాలి కలిగించడానికే! 'ట్యూటర్'లో వాణి తెలివి తేటలూ, సహృదయమూ వున్న ఆధునిక యువతి. అయినా అట్లా ప్రవర్తించిందీ అంటే సోమరి, ధనిక తరగతికి చెందినదవడం చేతనే.

"అంతరాత్మ" లో తల్లీ, కొడుకు, కూతుళ్ళ మధ్య నగల సంబంధ బాంధవ్యాలు, 'ఇంతలో వుంది' లో భార్యాభర్తల నడుమ, "గడ్డు రోజుల" లో జానకీ, సత్యంల నడుమ ఆర్థిక మానసిక బాధల మూలంగా కలిగిన పరివర్తనాలు సునిశితమైన మానసిక విశ్లేషణతో పరిశోధించి వ్రాసినట్లు కనబడతాయి.

జీవిత సూత్రం ఏమిటో తెలుసుకోవడంతోనే వ్యక్తిలో అశాంతి మాయమవదు. అది ఏవిధంగా కదిలించాలో తెలియాలి. "జీవిత సూత్రాన్ని చేత బట్టినవాడు దాన్ని మరింత చిక్కు పరుస్తాడో, చిక్కు విడదీస్తాడో అది వాడి ఆదర్శాలను బట్టి వుంటుంది." చిక్కు విడదీసి చూపారు కొడవటిగంటి కుటుంబరావు; గ్రహించడం మన వంతు.

—సరోజినీ ప్రేమ్‌చంద్

## ఈ మధ్య అందినవి :

ఆప్కో చేనేత దర్శిని - 1988. 'చేనేత భవనము' - నారాయణగూడ, హైదరాబాదు - 29

'సమాజపు కోరల్లో' - నవల. నా. పార్థసారథి తమిళమూలానికి మాలతీ చందూర్ తెలుగు సేత. సాహిత్య అకాడెమీ, రవీంద్రభవన్, న్యూఢిల్లీ - 1 .... రు. 25 - 00



## PRIME MINISTER

**MESSAGE**

Over the centuries, India has absorbed, assimilated and synthesised diverse cultures and ways of life. Our very unity is founded in this diversity. I am happy to learn that the Bharat Cultural Integration Committee has been endeavouring to promote national unity through arts and culture.

I send my best wishes for the success of the 13th National Festival of Music and Dance for National Integration.

New Delhi
November 1, 1988



Mind and Psychic Powers by CK Sreedharan, Bangalore 32... Rs. 10 – 00

'మన దేవతలు' - జానమద్ది హనుమచ్ఛాస్త్రి. శ్రీశైల దేవస్థానం వారి ప్రచురణ.

'అలలు' - కవిత, వి ఆర్ విద్యార్థి .... మాధురీ పబ్లికేషన్స్, హైదరాబాదు - 380 .... రు. 8 - 00

తార - ఆంధ్ర వారపత్రిక సీరియల్ - రు. 21 - 00; చైతన్య జ్యోతి - రెండు భాగాలు - స్వాతి వారపత్రిక సీరియల్ - ఒక్కొక్క భాగం రు. 22 - 00; రేవతి - డైరక్టు నవల - రెండు భాగాలు - ఒక్కొక్క భాగం రు. 23 - 00. శ్రీమతి హజరా, నవలలు. శ్రీ కవితా పబ్లికేషన్స్ విజయవాడ - 2.

అందుకున్నవన్నీ గాక పోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి.

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచన మృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతకనేర్చిన జాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 35 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |

20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు. ముందుగా ఆ పుస్తకాలధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V.P.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.

క్వాలిటీ పబ్లిషర్స్
రామమందిరం వీధి – విజయవాడ – 2

# గిరీశం

## యన్నార్ చందూర్

మా చిన్నప్పుడు ఏలూరు సాహిత్య మండలిలో 'కన్యాశుల్కం' అన్నది నాటకమా, ప్రహసనమా అన్న చర్చ జరిగింది. కొందరు నాటకం అన్నారు; మరికొందరు ప్రహసనం అన్నారు. ఇంత మంచి నాటకాన్ని పట్టుకు ప్రహసనం అంటారేమిటి?-అని అప్పట్లో నా కనిపించింది. నాటకం అనగానే ధీరోదాత్తుడో, ధీరస్వాంతుడో, ధీరలలితుడో అలాంటి నాయకుడు, అందుకు తగ్గ ప్రతి నాయకుడు, విదూషకుడు, అపురూప సౌందర్యవతి అయిన నాయిక, యిలా చాలా కావాలి. విదూషకుని పోలిన గిరీశం నాయకుడు కాలేడు, ఇక బుచ్చెమ్మని నాయిక అనలేము; సౌజన్యా రావంటారూ .... సమస్యా పరిష్కర్తేగాని ఆయన నాయకుడు కాదు .... ఆ చర్చ అయిన కొన్నాళ్లకు 'కన్యాశుల్కం' శ్రద్ధగా చదివాను. ఆనంద గజపతి ముందు ప్రదర్శించినపుడు, 'నాందీ ప్రస్తావన' వుంది. ఆ 'నాందీ ప్రస్తావన'లో వ్యావహారిక భాషనే గ్రహించి, ఇంగ్లీషు నాటక పద్ధతిని అవలంబించి కన్యాశుల్కమనే నాటకాన్ని రచించారనీ, గొప్ప రూపకమైన 'కన్యాశుల్కమనే' ప్రహసనాన్ని రచించారనీ, నాటకం ప్రహసనం రెండూ అన్నారు. జనరంజన, రసజ్ఞత ప్రధానంగాని ఏమంటేనేం ?

1880లో కందుకూరి వీరేశలింగం పంతులు రచించిన 'బ్రాహ్మ వివాహం' వెలువడింది. అందులో అజ్ఞానమ్మ, శ్రావణమాసానికి రెండేళ్లు నిండే తన కూతురిని, నలభై ఏళ్ల మేనల్లుడికిద్దామనుకోగా, భర్త కామయ్య అరవై ఏళ్ల నాలుగో పెళ్లివాడిని చూస్తాడు. ఇప్పుడు మనకి ఆశ్చర్యంగా వుండ వచ్చుగాని, ఆనంద గజపతి ఆ రోజుల్లో తన వుద్యోగుల ద్వారా సేకరించిన లెఖ్ఖల ప్రకారం, ఒక్క విశాఖపట్నం జిల్లాలో, కన్యాశుల్కం పుచ్చుకు జరిపించిన 994 పెళ్లిళ్లలో ఆడపిల్ల వయసు అయిదు సంవత్సరాలకి లోపు, 'బ్రయిడ్ మనీ' - అనగా కన్యాశుల్కం, ఏభై రూపాయల నుంచి నాలుగు వందల దాకా వుండేదట. ఒకవైపు ఇటువంటి వివాహాలు, మరొక వైపు వేశ్యావృత్తి; ఇక భాషా పరంగా చూదామా అంటే, పుస్తకాల భాషకీ మాట్లాడే భాషకీ పొంతన లేక పోవడం - అలాటప్పుడు ప్రజలలో చైతన్యం తేగలిగినది రంగవేదిక ఒక్కటే - అనిపించింది గురజాడకు. అయితే అందుకు అనువైన భాష మనకి

లేదు. నెల్లూరు నుంచి వేదం వెంకట రాయశాస్త్రి, 'ప్రతాపరుద్రీయం' లో మధ్యేమార్గం అవలంబించగా, విజయ నగరం నుంచి గురజాడ అప్పారావు 'కన్యాశుల్కం' ద్వారా తెలుగు భాషామ తల్లి శృంఖలాలు తెంచి, గిరీశం అనే నిత్యనూతనుని ప్రసాదించారు. వందేళ్ల క్రితం గిరీశాన్ని సృష్టించారు గురజాడ వారు - అతను యిప్పటికీ మన మధ్య మసులుతున్నాడు.

"కన్యాశుల్కం" తొలిముద్రణ మొదటి పేజీలో యిలా వుంది: "శ్రీరస్తు - కన్యాశుల్కము. ఇది శ్రీవిజయనగర రాజ్యమున ప్రాచీన లిపి పాఠకుడగు గురజాడ అప్పారావు పంతులుబి.ఎ. చే రచింపబడినది. దీని వెల .... ఎనిమిది అణాలు, అంచె కూలీ ఒక అణా - అంటే పోస్టేజి కావచ్చు. A. Telugu Comic Play in Five Acts." - ఆ 'కామిక్ ప్లే'లోని కమేడియనే గాక ఘటనా క్రమంలోని సూత్రధారి మన గిరీశం - "ఏమివాయ్ మైడియర్ షేక్స్పియర్, ముఖం వేల వేసినావు?.... నీ మేస్టరుకి నిన్ను చూస్తే కిట్టదు. అందుచేత నిన్ను ఫెయిల్ చేసినాడుగాని లేకుంటే నీవు ఫెయిల్ కావడమేమిటి?" అని వెంకటేశాన్ని సముదాయించి, సురేంద్రనాథ్ బెనర్జీ అంతటివాణ్ణి చేస్తానని చెప్పడంనుంచి, 'యిప్పుడు నాలుగు గంటలపావు అయినది. అరు ఘంటలకు స్టీమరు వెళ్ళిపోతుంది. నీవు యీ నిముషము బయలుదేరి స్టీమరు అందుకొని, రాజమహేంద్రవరము వెళ్ళిపో" - అని సౌజన్యరావు శాసించేదాకా, ప్రగల్భాలు, పబ్బంగడుపుకునే ప్రయత్నాలు, వక్రించిన పాండిత్యం, పరమపద సోపాన పటంలో పామునోట పడుతూండటం ఎంతటి క్లిష్ట పరిస్థితిలోనూ ఆత్మస్థయిర్యం కోల్పోక పోవడం, సందర్భానుసారమైన కథలు అవలీలగా అల్లడం - యిలాటివేతప్ప దుష్టత్వం కనిపించదు ఆ పాత్రలో! ఎదుటివారి అభిమానం యిట్టే సంపాదించగల నేర్పరి. 'లెక్చరెంతసేపూ సిటీలలోనే కాని పల్లెటూళ్ళలో పనికిరాదు,' అని తెలిసిన వాడు గనకనే పార్వతీపురం దావాకు జబ్బల్పూర్ హైకోర్టు తీర్పు పేర్కొంటూ, అగ్నిహోత్రావధానులని జేబులో వేస్తాడు. పూజా పునస్కారాలు లేక బూజెక్కి వున్నాడు గాని మన కంట్రీయే ఇన్డిపెండెంటు అయిపోతే, తను గ్లాడ్స్టన్ లాగా, దివాన్గిరీ చెలాయించేవాడుట. 'నెల వక్కొంటికి నూరు రూపాయలు యిచ్చి పోషించడముకు సభ ఒకటి యున్నది రామవరములో' - అని బుచ్చెమ్మలో ఆశాదీపం వెలిగించి, జగన్నాధపురంనుంచి బండి మళ్ళించిన గిరీశం, లుబ్ధావధానులు, అగ్నిహోత్రావధానులు, కరటకశాస్త్రి వీళ్ళందరి మధ్యా వుక్కిరిబిక్కిరికాగా, వాచాలత్వం ఎక్కువగా వున్న ఈ యువకుడు మోసగాడు కాదు, కుదురుగా చదువుతు, పట్టా తెచ్చుకుంటే, బుచ్చెమ్మతో పెళ్ళి జరిపించవచ్చు అనుకుంటాడు సౌజన్యా

రావు. బుచ్చెమ్మ అప్పటికే 'విడోస్ హెూమ్' భద్రంగా చేరుకునివుంది. 'డామెట్, కథ అడ్డంగా తిరిగింది' అంటూ స్వస్తివాచకం పలికిన గిరీశం రాజమహేంద్రవరం వెళ్ళాడా - లేదా ? వెళ్తాడా, లేదా ? - ఆ ప్రశ్నే గిరీశం పాత్రని నూరేళ్ళు గడిచినా సజీవంగా వుంచుతోంది.

నాలుగు వందల ఏళ్లయినా షేక్స్పియర్ హామ్లేట్, కింగ్‌లియర్, మాక్‌బెత్, ఓథెల్లో, రోమియో అండ్ జూలియెట్, జూలియస్ సీజర్ వంటివి ఎలా సజీవంగా వున్నాయో, అదే మాదిరి నిత్యయౌవనుడు గురజాడ వారి గిరీశం. ఆలివర్ గోల్డ్‌స్మిత్ 'బు - టిబ్స్' నీ, రవీంద్రనాధ టాగూర్ 'బాబూస్ ఆఫ్ నాయన్‌జోర్' ని గుర్తుకుతెచ్చే ఈ గిరీశం మనకి కోపం తెప్పించడు - మనని నవ్విస్తూ తనూ నవ్వేందుకు ప్రయత్నిస్తాడుగాని హాయిగా నవ్వలేడు. గుండెలనిండా ఏదో అశాంతి, ఆవేదన, ఏదో చేయాలనే తపన - కాని ఎక్కడి కక్కడ బంధాలు. అయితే నిరాశ నిస్పృహలు మాత్రం అతని దరికిరావు. 'ఖగపతి యమృతము తేగా భుగ భుగమని పొంగిపొరలి భూస్థలిబడి తా పొగ చెట్టయి జన్మించెను - పొగత్రాగని వాడు దున్నపోతై పుట్టున్' - అని గిరీశం అన్నాడంటే అది చాటువులతో అతనికిగల పరిచయానికి మచ్చుతునక. అలాగే ఆడిదం సూరకవిని జ్ఞప్తికి తెస్తాడు : చుక్కలవలె కర్పూరపు ముక్కలవలె నీదు కీర్తి ముల్లోకములన్ క్రిక్కిరిసి పిక్కటిల్లెను -' అన్నపుడు ! యాన్ టేలర్ 'మై మదర్' ఈ నాటికలోని ఇంగ్లీషు పద్యం 'ది విడో' అయింది.

'మూఢాచారాలలో మగ్గుతున్న ప్రజని సంస్కరణ ద్వారా తప్ప పైకి లేవనెత్తలేము. సంస్కరణ వల్లనే సామాన్య జీవితం మెరుగవుతుంది. అందుకు దోహద పడేదే సాహిత్యం' అంటారు గురజాడ. Literature cannot have a higher function than to show up such practices and give currency to a high standard of moral idea. Until reading habits prevail among the masses, one must look only to the stage to exert such healthy influence. These considerations prompted me to compose 'Kanyasulkam'......... - అన్నారు గురుజాడ మొదటి ముద్రణ పీఠికలో.

నవయువకునిలోని ఆరాటానికీ, ఆతృతకీ, ఆవేశానికీ ప్రతీక గిరీశం, హానికరంగాని అబద్ధాలు చెబుతూ, పాదరసంలా పరిగెడుతూ, పరిస్థితులకు బందీ అవుతూనే ఎవరినో వుద్ధరించాలనే ఉబలాటంతో, అంతరంగలోని ఆశయం కోసం ముందడుగువేసే యువతకు ప్రతినిధి గిరీశం. ప్రజలు మాట్లాడుకునే జీవభాషకు వూపిరి పోసిన గిరీశం నిత్యశోభితుడు, నిరంతర పథికుడూను.

**—'ఆకాశవాణి' సౌజన్యంతో**

?

"Sumantra was the Chief Minister of Ayodhya and he was to take instructions from King Dasaratha. How could he go to fetch Rama at the behest of Kaikeyi?" questioned Raghu.

"Surely not at her behest. Sumantra knew it was the Day of Coronation. The entire town was agog with festivities. The auspicious moment was fast approaching and Dasaratha who went into the chambers of Kaikeyi just to inform her of the good tidings had not returned. After waiting for some reasonable time he thought it prudent to walk into the chambers of Kaikeyi and there to his utter surprise he found Dasaratha in a swoon."

"Didn't he ask her how it happened?" was Raghu's query.

"Propriety forbade him to seek any information on his own. Dasaratha was unconscions. If the queen were to mention, he had to listen to and render counsel if sought for. Kaikeyi, the shrewd lady, asked him to go and fetch Rama who was living in a different mansion away from the Royal Palace. Sumantra thought she wanted him to fetch Rama in time for the coronation. What transpired between the king and the queen was revealed by her only to Rama on his arrival. Sumantra learnt of the sad turn of events just like the rest of inmates."

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*

BCIC & VST–

# సంగీతోత్సవం

ప్రతీ సంవత్సరం మాదిరిగానే, భారత సాంస్కృతిక సమగ్రతా సంఘం, (బి సి ఐ సి - మద్రాసు) వియస్‌టి ఇండస్ట్రీస్ వారి సౌజన్యం తో, ఢిల్లీలో మూడు రోజుల పండుగ జరిపించారు. ఈసారి ఉత్సవాలలో ఒక ప్రత్యేకత పద్మావతీ అమ్మవారి కుంకుమార్చన. 18వ తేదీ ఉదయం తలంట్లు పోసుకుని, కుంకుమ బొట్టుతో అలంకరించుకుని, ముత్తయిదువలు టాల్‌కటోరా స్టేడియమ్‌కి వస్తూంటే ఆంధ్ర గ్రామీణ ప్రాంతంలో సంక్రాంతినాడు, పేరంటానికి వెడ్తున్న మహిళా బృందం మనసులో మెదిలింది. వయసుతో, అంతస్తుతో, కులంతో ప్రమేయం లేకుండా దాదాపు అయిదువందల మంది మహిళలు ఇన్‌డోర్ స్టేడియమ్‌లో కూర్చున్నారు. కాని అర్చనకు కావలసినది నూట ఒక్కరు మాత్రమే. పెద్దలు ఎంపిక చేసిన నూటఒక్క ముత్తయిదువలు పంక్తులుగా కుంకుమతో కూర్చుని అర్చన జరిపారు. ఆ ఆడపడుచులందరికీ, చీర సారెలు, కుంకుమ ప్రసాదాలూ పంచిపెట్టారు. ఉదయం నుంచీ పర గడుపుతోవున్న ఈ మహిళలందరికీ ప్రత్యేక పందిరిలో భోజనాలు .... సహస్రనామార్చన, జరిపించుకున్న పద్మావతీదేవి, షోడశ కళలతో వెలిగిపోతూండగా ఉత్సవ విగ్రహాలు ముచ్చట కొల్పుతున్నాయి. ఒక ప్రక్క పళనిస్వామి నాదస్వరం; మరోప్రక్క ముత్తయిదువుల మంగళ గీతాలు.

ఈ సందర్భంగా ఇందిరా గాంధీ జయంతిని పురస్కరించుకుని, పన్నెండుగురు ప్రముఖ మహిళలకు సత్కారం జరిగింది. బి సి ఐ సి అధ్యక్షులు బి డి జెట్టి, ఒక తండ్రి తన కుమార్తెలకు ఇస్తున్న మాదిరిగా, వారిని పట్టుచీరలతో సత్కరిస్తూంటే, 'యావత్‌భారతం - ఒకే కుటుంబం' అనిపించింది. నాట్యప్రదర్శన తర్వాత వాణీజయరాం "బ్రోచే వారెవరురా!" అని ప్రారంభించగానే ప్రతి ఒక్కరి హృదయం స్పందించింది.

రెండవరోజు 19వ తేదీ - సాయంత్రం నాలుగు గంటలకల్లా ముఖ్యులు వేదిక మీద ఆసీనులయ్యారు. కన్వీనరు టివికె శాస్త్రి పెద్దలను పరిచయం చేశాక 'జి వి జి' జన్మదినం అని వెల్లడించి, ఆయనకు కూడా శాలువ కప్పారు. జస్టిస్ రంగనాథ మిశ్ర, 'జాతీయ సమగ్రత' మీద చేసిన ప్రసంగం, అందరి మనసుని హత్తుకుంది. ఇవ్వాళ వేదికమీద దేవతా మూర్తులు లేరు. నీలాకాశంలో ఎగురుతున్న రెండు పక్షులు, 'Come

celebrate the Spirit of Freedom' అన్న ప్రబోధంగల బాక్ డ్రాప్ మాత్రం వుంది. రెండు ప్రక్కల 'బి సి ఐ సి' వారి సంకేత చిహ్నాలు.

హిందూస్థానీ సంగీత ప్రపంచంలో ప్రముఖ జంట డాగర్ సోదరుల గాన కచేరి ప్రేక్షకులను తన్మయులను చేసింది. తర్వాత మంగళంపలి బాల మురళీకృష్ణ గానామృతంలో ముఖ్యంగా భద్రాచల రామదాసు కీర్తనలు వింటూ వుంటే, చాలా మందికి పరవశత్వం కలిగింది. బిర్జూమహరాజ్ బృందం వారి కథక్ నృత్యం చూస్తున్నంత సేపూ, ఈ బృందంలోని చాలా మందికి ఒకే రూపురేఖలు కనిపించాయి. తర్వాత తెలిసింది ముగ్గురు బాలికలూ, ఇద్దరు బాలురూ ఆయన పిల్లలేనని !

20వ తేదీ మూడవ రోజు సాయంత్రం అయిదు గంటలకు ప్రముఖ నేపథ్యగాయకులు యస్పి బాలసుబ్రమణ్యం, ఆయన సోదరి శైలజ - భక్తిగీతాలు గానం చేశారు. ఆయన రామలింగాష్టకం గానం చేస్తూంటే, అనేకమంది చేతులు జోడించి, పరమశివుని ధ్యానంలో నిమగ్నులయారని చెప్పవచ్చు. త్యాగరాజ కీర్తన ఒకటి, ఇంగ్లీషు ట్యూన్‌లో పాడి విదేశీయులని విస్మయపరిచాడు బాలు.

కేంద్ర మంత్రులు మొహిషిన కిద్వాయ్, మారరెట్ అల్వా, ఢిల్లీ లెఫ్ట్‌నెంట్ గవర్నర్, మున్నగు ప్రముఖులు జాతీయ సమగ్రత గురించి ప్రసంగాలు చేశారు. జాతీయ సమగ్రతని సంగీత సమగ్రతని ప్రతిబింబించే 'యుగళబంద్', ఉస్తాద్ అమ్జద్‌ఖాన్ - సద్‌రోతో, టియన్. కృష్ణన్ వయోలిన్ గంగా - కావేరీ సంగమంలా సంగీత వాహినై ప్రవహించింది. వాదకులు ఒకర్నొకరు ప్రోత్సహిస్తూ కచేరి సాగించారు.

ఈ మూడు రోజులూ అనేక సత్కారాలు జరిగాయి. దుశ్శాలువలూ, పట్టు చీరలూ, వెంకటగిరి చీరెలూ సమర్పించారు. టాల్‌కటోరా స్టేడియమ్ యావత్తూ సంగీత స్పర్శతో పులకాంకిత మయింది. దేశ సమగ్రతాగీతమనదగు ఈ మూడురోజుల సంగీతోత్సవం ప్రతి ఒక్కరినీ ఆనంద పరుస్తూ ఒక మహదానుభూతిగా నిలిచి పోయింది.

—అద్దంకి మన్నార్

ఉత్తప్పుడు నమ్మడానికి సంశయించే విషయాలను, వెంటనే నమ్మేటట్లు చేసేదాన్నే ప్రేమ అంటారు.

—మేరి నాక్స్

స్త్రీలు అందంగా కనపడటానికి కారణం ఒక్కటే ! వారు తమ ఆంతర్యంలో ఏమున్నప్పటికీ పైె ప్రవర్తనలో మాత్రం నాజూకులు విడనాడరు.

—క్రిస్టి

సౌందర్యమనగా ఈ వికృత ప్రపంచపు ముడిపదార్థం నుంచి, ఆత్మ బలిదానంతో కళాకారుడు సృష్టించే అనుపమలావణ్యం. —మామ్

## 1776 జులై - ఆ నాలుగు రోజులు

# స్వాతంత్ర్య పత్రం



అమెరికాలోని పదమూడు రాష్ట్రాలూ మాతృదేశమైన ఇంగ్లండు నుంచి విడిపోదామనుకుంటున్నాయి. ఆంగ్ల చక్రవర్తి మూడవ జార్జికి ఈ వలసలని తొక్కిపెట్టి వుంచాలనే తప్ప, వారి కష్టసుఖాలు విచారించాలనే విజ్ఞత లేకుండా పోతున్నది. రాజధిక్కారమనుకుంటున్నాడాయన ; ప్రజాస్వామిక న్యాయం - అంటున్నారు జఫరన్స్ ప్రభృతులు... ఇక చదవండి

జాన్ డికెన్సన్ లండన్‌లోని మిడిల్ టెంపుల్‌లో న్యాయవాద విద్య అభ్యసించి ఫిలడల్ఫియాలో ప్లీడరు వృత్తి ప్రారంభించి, ధనికుల ఆస్తిపాస్తులు కాపాడటంలో అగ్రగణ్యునిగా పేరు గాంచాడు. తన ముప్పైనాలుగో ఏట పెన్సిల్‌వేనియా రైతువద్దనుంచి లేఖలు- అను ఒక పుస్తకము ప్రచురించాడు. అమెరికా దేశపు రాజకీయాల కది ఒక ప్రధాన గ్రంథమయింది. వలసలకు గల హక్కులను వివరిస్తూ, ఆంగ్ల ప్రజలు అక్రమపాలకులపై జరిపిన తిరుగుబాట్లను ఉదాహరిస్తూ, ఎంతో నైపుణ్యంతో రచించాడు ఆ గ్రంథాన్ని. ప్రజల తరఫున మాట్లాడుతూ ఆందోళనకారులకు హెచ్చరిక చెబుతూ, పాలకులను ఆత్మపరీక్ష గావించుకోమన్నాడు. "ఈ వివాదాలలోనిరంతరజాగురూకతతో నడుచుకోడం జరిగే పనికాదు. స్వాతంత్ర్య పిపాసలోమహోన్నతా దర్శమున్నది. అది అలజడివల్లా ఆర్భాటంవల్లా సిద్ధించదు. గిల్లికజ్జాలతో పోరాటం పెంచు హేతువాదం పూర్తిగా మాసిపోతుంది. ప్రజానీకం తన మంచిచెడ్డలు విస్మరిస్తుంది ; కోపం చల్లారడమే ప్రధాన మనుకుంటుంది."

పది సంవత్సరాలపాటు జాన్ డికెన్సన్ అమెరికా రాజకీయాలలో అగ్రగామిగా భావింపబడ్డాడు. ఈజులై ఒకటో తేదీ సాయంత్రం వేళ, అతను ఒక నిర్ణయానికి రావలసిన అవసరం ఏర్పడుతోంది. అటో ఇటో నిర్ణయించుకోవలసి వున్నది. ఇప్పుడు తన కర్తవ్యమేమిటి ? ప్రతినిధులందరి ముందూతన అభిప్రాయం నిర్భయంగా చెప్పాడు. కాని అధిక సంఖ్యాకులు తన అభిప్రాయానికి వ్యతిరేకంగా వున్నారు.

గ్రేట్ బ్రిటన్ నుంచి విడిపోతే యిప్పుడు జరిగేదేమిటి ? ఈ దేశానికి సంభవింపనున్న ముప్పు ఎటువంటిది ? అసూయా ద్వేషాలు తమని ముందుకి తరుమగా ఈ ప్రజలు వేరు వేరు రాష్ట్రాలుగా చీలిపోయి, దారుణ హింసాకాండలతో అంతర్యుద్ధాలతో రక్తపాతంలో మనుగడ సాగించగల

ప్రమాదం వున్నది. అది తన కళ్ళకు కనబడుతోంది. తాను ఈ స్వాతంత్ర్య తీర్మానాన్ని బలపరుస్తూ వోటు వెయ్య లేడు. భోజనాల బల్ల వద్ద నుంచి లేచి, తనకేదో పని వున్నదని చెబుతూ, పఠన మందిరాన్నానుకొనివున్న గదిలోకి వెళ్లాడు. బీరువా తెరిచి ఫిలడల్ఫియా ఫస్ట్ రెజిమెంటుకు చెందిన తన సైనిక దుస్తులు తీశాడు. ఇప్పుడు తను ఆ సైనిక దుస్తులు ధరించి, న్యూయార్క్ రేవును కాపాడుతున్న జనరల్ వాషింగ్టన్‌కి సహాయంగా యుద్ధభూమికి వెళ్ళడముకంటె తాను సమావేశములో చెప్పగల దేమున్నదని అనుకున్నాడు. తన గురించి ప్రచారమయే విమర్శలకూ, అపోహలకూ అదే తగు సమాధానమని భావించాడు.

నావికులకీ నౌకావ్యాపారులకీ కూడలిస్థలమైన టన్ టావరిన్‌లో ఆ సాయంత్రము జాన్ మార్టన్ (పెన్సిల్వేనియా) శామ్యూల్ యాడమ్స్‌తో భోజనము చేస్తున్నాడు. ఈ టన్ టావరిన్ చుట్ట పొగతోనూ, సారా సీసాలతోనూ మహాహడావిడిగా వున్నది. తన చుట్టూ వినబడుతున్న మాటలు శ్రద్ధగా వింటున్నాడు శామ్యూల్ యాడమ్స్. నౌకా వార్తలను కొనితెచ్చేది వారే. హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో రెండు డిగ్రీలు పుచ్చుకొన్న పండితుడైనప్పటికీ, యీ నావికులతో కలసిపోవడం అతనికి న్యూనతగా తోచలేదు. ఈ నావికులు బాస్టన్ రేవులోగల తన మిత్రులను జ్ఞప్తికి తెస్తున్నారు. ఈ నావికులు ధీరత్వంతో స్వాతంత్ర్యేచ్ఛతో తమ దేశముకోసం పోరాడటానికి సిద్ధముగా వున్నారు.

కెప్టెన్ ఫౌలర్ (ఛార్లెస్‌టన్) అంటున్నాడు : నాలుగు వేల పౌనుల విలువ గల నీలిమందు మా ఓడలో వున్నది. మేము చల్లగా జారుకుంటూండే వేళ సర్ పీటర్ పతాక నౌక ముప్పై ఓడలు మాకు కనిపించాయి. మిగతావి గంటల వారీ వస్తున్నాయి సల్లివాన్ దీవి రక్షణాధికారి మౌల్ట్రీవద్దకు, పీటర్ తన పతాకాన్ని పంపించి, తక్షణము శరణు వేడమన్నాడట. కాని, మౌల్ట్రీ - అలా కుదరదు, చివరవరకూ పోరాడ దలచుకున్నాము - అని చెప్పాడట."

మరొక టేబుల్ వద్దనుంచి : "కెప్టెన్, నామాట విను. వెస్టిండియా దీవులలోని ఫ్రెంచి రేవులన్నీ మనకి తలుపులు తెరిచాయి"

ఎడమ వైపుగల బల్ల వద్దనుంచి : "మేము బయలుదేరబోయే ముందు నౌకాధికారి డన్‌మోర్ గ్వెన్స్ దీవిలో దిగ్బంధం చేయబడ్డాడట. నల్లవారందరినీ మీపై వుసికొల్పి నా కసి తీర్చుకుంటాను - అని బెదరిస్తున్నాడట" మూలమూలల నుంచీ యిలా మాటలు వినవస్తున్నాయి.

"నిన్న ఒక వోడ సముద్రముపై కాలిపోవడం చూశాను."

"పాపం, వాకర్ మందుగుండు ప్రేలుడు వల్ల చనిపోయాడట."

"ఎదుర్కోమని నేను అనే సరికి వాళ్లు వెంటనే మాపై పేల్చారు. మేము తిరిగి పేల్చాము. మా మనుషుల్లో

తొమ్మండుగురికి గాయాలు తగిలాయి. కాని ఎవ్వరూ చనిపోలేదు. మా నావికులు మాత్రం సముద్ర సింహాలవలె విజృంభించారు''

ఈ నావికులప్పుడే బ్రిటిష్ నౌకా దళముపై యుద్ధము ప్రకటించారన్న మాట. జాన్ మార్టన్ మాత్రమే అటో ఇటో తెల్చుకో లేకుండా వున్నాడు. పెన్సిల్‌వేనియా భవిష్యత్‌ని మార్టన్ వోటు నిర్ణయించ నున్నది. అయిదుగురు ప్రతినిధులలోనూ యిరువురు స్వాతంత్ర్య తీర్మానానికి సుముఖులు; డాక్టర్ ఫ్రాంక్లిన్, జేమ్స్ విల్సన్, ఇరువురు అందుకు వ్యతిరేకులు, చార్లెస్ హంఫ్రీస్, థామస్ విల్లీస్, మార్టన్‌ల నిర్ణయమే పెన్సిల్‌వేనియా భవితవ్యం. సామాన్య కుటుంబంలో జన్మించిన మార్టన్, తను కాంగ్రెసు ప్రతినిధిగా ఎన్నుకోబడటం ఒక అదృష్టంగా భావించాడు. ఈ సజ్జనుడు తనబాధ్యతలు గుర్తెరిగిన పౌరుడు. ఇల్లూ, ఇల్లాలూ ఎదిగిన కొడుకులూ కూతుళ్ళూ. ఈ కుటుంబ భారం అతనిని యీ క్లిష్టసమయంలో కడుజాగరూకతతో వ్యవహరించమంటున్నది.

టన్ టావరిన్‌లో అతనికి అతిథ్యమిస్తున్న శామ్యూల్ యాడమ్స్, మార్టన్ సందేహాలు పారద్రోలే వ్యక్తి కాదు. ఆ సందేహాల గురించి అతను ప్రస్తావించనేలేదు. వందలూ వేలూ సంఖ్యలో ప్రజలను స్వాతంత్ర్యము వైపు తిప్పిన శామ్యూల్ యాడమ్స్, ఈ సాయంత్రము పూట మార్టన్ ముందు నిశ్శబ్దంగా కూర్చున్నాడు. వినబడుతున్న పలుకులకు చిరునవ్వు నవ్వుతున్నాడు. అతని ముఖ కవళిక, మన చుట్టూ గల మనుషులు అనుకుంటున్నది వినండి అన్నట్లుగా వున్నది. భోజనమై పోయాక, యాడమ్స్ తన అతిథితో, కరచాలనం చేసి 'రాత్రి హాయిగా నిద్రపొండి' అని స్నేహపాత్రంగా చెప్పాడు. శామ్యూల్ యాడమ్స్, మాటలతో గాక మౌనంతో ఈ మనిషిని జయించాలని ముందే తెలుసుకున్నాడు.

జఫర్‌సన్ తన వ్రాతబల్ల వద్ద కూచుని పత్రాలు పరిశీలిస్తున్నాడు. బెనిడిక్ట్ అర్నాల్డ్ సాహసయాత్ర వివరాలు, కెనడా నుంచి వచ్చిన నివేదికనూ పరిశీలిస్తున్నాడు. ఫ్లెమింగ్ నుంచి వచ్చిన వుత్తరము సంతాపకరమైనది. హారిసన్, బ్రాక్‌స్టన్ లిరువురూ ఎన్నిక కాలేదు. జఫర్‌సన్‌ని కూడా వొదులుకునేందుకు సిద్ధంగా వున్నారు. ఫ్లెమింగ్‌కి వెంటనే జవాబు రాశాడు. పది సంవత్సరాల క్రితం తనూ ఫ్లెమింగూ, యౌవనోత్సాహములో జాతి గుర్రాలను, అతి శ్రేష్ఠమగు జాతిగుర్రాలను సేకరించి, కొందరు సుందరీమణులకు బహూకరించే వారు, పరుగులు తీసే పరువం వెళ్ళిపోయింది. ఇది నిండైన నదీ ప్రవాహము.

1776 జులై ఒకటవ తేదీన జఫర్‌సన్ ఇలా రాశాడు: ప్రియ మిత్రమా, న్యూయార్కులోని విప్లవము ఇంకా సంపూర్ణ స్థాయిని అందుకోలేదు. ఒక విషయము మటుకు కార్యావసరాన్ని బట్టి చేయవలసి వచ్చింది. సర్వసైన్యా

ధిపతి అంగరక్షకులలో ఒకడు విద్రోహము తలపెట్టడంవల్ల, నేరవిచారణ జరిపి అతనికి మరణదండన విధించడము జరిగింది. ఆ విద్రోహిని పోయిన శనివారము కాల్చి వేయవలసి వచ్చింది. జనరల్ హా తన నౌకాబలంతో రేవు పరిసరాల వున్నాడు. హరిసన్, బ్రాకెస్టన్‌లను ఎన్నుకోక పోవడము నాకు మనఃస్థాపాన్ని కలిగిస్తోంది. మన దేశ ప్రజలకు నా గురించి ఏదేనా సంశయముంటే, నేను లిఖించిన స్వాతంత్ర్య తీర్మానమే నా రాజకీయ లక్ష్యాలకు నిదర్శనముగా వారికి సమాధానము యివ్వ గలుగుతుంది. స్వాతంత్ర్య తీర్మానపు ప్రతులను వర్జీనియా రాష్ట్రములోని మిత్రులకు పంపదలచుకున్నాడు జపర్‌సన్. తన స్థాన మేమిటో తాను తెలుసుకోవలసి వున్నది.

మూడు వారాలు గడిచాయి; మార్తా వద్ద నుంచి ఉత్తరము లేదు. అయిదు సంవత్సరాలు క్రితము తన అత్తవారింట్లో గడిపిన ప్రారంభ శుభదినాలు జ్ఞాపకము వచ్చాయి. ఆమె గానామృతమే అతనిని ఆకర్షించింది. ఆమె పాడగా, తాను అందుకు శృతిగా ఫిడేల్ వాయిస్తూ, ఇటాలియన్ సంగీత నాటకాలలోని పాటలు పాడేవాడు. మాంటిసెల్లోలోని తమ నూతన గృహములో ప్రాతఃకాలాలూ, సంధ్యా సమయాలూ తమ రాగ స్రవంతిలో ప్రణయ గీతాలతో గడిచిపోయేవి, తమ ఇల్లు ఇంకా సగమే అయింది. పూర్తి కాలేదు. భార్యా పిల్లలతో స్వజనమూ మిత్రబృందమూ మధ్య కవిత్వమూ కావ్యాలతో కాలము వెళ్ళబుచ్చాలని తనకి వుంది. కాని భవిష్యత్ తనకా అదృష్టాన్ని ప్రసాదిస్తుందా ?

విద్రోహకరపత్రమని పేర్కొనబడగల తీర్మానప్రతిని పరిశీలనగా పరికించాడు. తన జీవితము అవమానముతో అంతము కావచ్చు. తన భవిష్యత్ అంధకారము కావచ్చు. తనని ఒక ఆందోళన కారునిగా భావించి ఆంగ్ల పాలకులు తనకి దేశాంతరవాసం శిక్షగా విధించవచ్చు. లేదా వురితీయవచ్చు. ఈ భయాందోళనలు తన మనసునించి తరిమివేశాడు జఫర్‌సన్ విశ్వాసమే పట్టుగొమ్మగా అడుగువేయ దలచుకొన్నాడు. ఆశయే చుక్కానిగా యీ విప్లవ నౌకని నడపాలని అనుకున్నాడు. కిటికీ వద్దకు వచ్చి పడమటి దిశగా చూశాడు. వర్షంతో తడిసినకొండలూ బండ్లబాటలూ చిట్టడవిదిశగా పరుచుకుని వుండటం అతనికి కనిపించింది. పడమటి దిశనే భవిష్యత్ వున్నది. ఈ అరణ్యభూములు ఈ ఖండాన్నంతటినీ తమ బాహుబంధములో దాచుకున్నాయి. ఈ ప్రదేశాలు లక్షలాది శ్రామికులకు వ్యవసాయ క్షేత్రాలై, రేపటి మహాపట్నాలై, ముందు కాలంలో జన్మించగల స్వాతంత్ర్య పౌరులకు ఆటపట్టవుతాయి.

పూర్వ ప్రపంచంలోని గాలి విష పూరితమైపోయింది. ప్రాచీన దుర్వ్యసనాలతో అది బసివెక్కి పోయింది. నవయుగోదయ వైతాళికులు, తన దేశ పౌరులను చరిత్రబాటలో కలుసు

కుంటున్నారు. ఆ జన సందోహానికి తను మార్గ సూచకుడై, ఈ ఘటనా చక్రానికి ఒక నూతన పథము నిర్ణయిస్తున్నాడు.

కర్నల్ మార్గన్ పంపిన వార్తాహరుడు డోవర్ జేరుకునేసరికి అర్ధరాత్రి దాటింది. తుపానులో అతను పూర్తిగా తడిసిపోయాడు, చిట్టచివరికి తనగమ్యం చేరుకున్నాడు. వ్యవసాయ క్షేత్రంలోని వేటకుక్కల సమూహమొకటి చీకటిని చీల్చుకుంటూ అతనిని చుట్టుముట్టింది. వాటి భయంకరమైన అరుపులు భూమిలో నిద్రిస్తున్నవారిని తిరిగీ మేల్కొల్పేటట్లు వున్నాయి. కొవ్వొత్తి వెలుగు కనబడింది. ముందు తలుపు తెరుచుకుంది. పొడుపుగా బక్కపలచగా వున్న మనిషి ఒక చేతిలో తుపాకితోనూ మరొక చేతిలో లాంతరుతోనూ వెలుపలికి వచ్చి గుమ్మానికి పక్కగా నిలబడ్డాడు.

"ఊ వూరుకోండి" అని కుక్కల్ని అదిలించి "ఏమిటి? ఏం పని మీద?" అని ప్రశ్నించాడు సీజర్ రోడ్నీ. మాక్కీన్ సందేశాన్ని ఆ వార్తాహరుడు, రోడ్నీకి అందజేసి ఫిలడల్ఫియాకి తక్షణమే బయలుదేరమని కోరాడు. డెలవార్ వోటుతో అమెరికా భవిష్యత్ నిర్ణయింపబడుతుంది. వర్షంలో తడిసివున్న ఆ వార్తాహరుణ్ణి వెచ్చగా వున్న వంటింట్లోకి తీసుకు వెళ్ళాడు సీజర్ రోడ్నీ.

రోడ్నీ ప్రయాణానికి సంసిద్ధము అవుతూండగా, అతని సోదరుడూ మేనల్లుడూ, నిద్రకళ్ళతో వంట ఇంట్లోకి వచ్చారు. ఇరవై సంవత్సరాల యువతి మేరీ, దగ్గర బంధువు, ఏమిటీ ఈ ఖంగారని గబగబా మేడ దిగి వచ్చింది. "నేను తిరిగి వచ్చేందుకు ఒకవారము రోజులు పడుతుంది. నా పొలములో పంట నీవు కోయించు" అని సోదరునితో చెప్పాడు రోడ్నీ. ప్రయాణానికి గుర్రాన్ని సిద్ధము చెయ్యమని మేనల్లునితో చెప్పాడు. అతనికి కడుపునిండా భోజనము పెట్టు - అని మేరీతో అన్నాడు. రోడ్నీ తన పటకాలు బిగించి మేరీ తీసుకొచ్చిన సిల్కు రుమాలు మెడకి చుట్టుకొన్నాడు. బయట ఈశాన్య దిక్కుగా యీదురుగాలి కొడుతోంది. విపరీతమైన చలి, మేరీ యిచ్చిన రుమ్మాలు మొఖము కొంత భాగమూ, మెడచుట్టూ, ఎడమ చెంపమీదగల పుండు కనిపించకుండానూ కట్టుకున్నాడు. అప్పటికే అతనికి కేన్సరు వ్యాధి సోకింది. లండను వెళ్ళి తగు చికిత్స చేయించుకుందామనుకున్నాడు. కాని యిప్పుడది యింతలో సాధ్యము కాదు. అశ్వశాలలోకివచ్చి తన గుర్రాన్ని ఎక్కి కూచున్నాడు. మేనల్లుడు గేటు తలుపు తెరిచి దీపము చూపుతున్నాడు. విపరీతమైన గాలి, ఆ దీపాన్ని యించుమించు వూదేస్తోంది.

(ఇంకా వుంది

**మాతృక : కార్నెల్ లెవ్‌గ్వేల్**

**తెలుగు : యస్వార్ చందూర్**

# చిత్రజగతి

## సమీక్షలు

### యస్సెస్ వారి 'మొదటి అనుభవం' (తెలుగు - తమిళం)

నేల, నీరు, జలచరాలు, భూచరాలు, ఖేచరాలు, వృక్షసంపద, సుగంధ పుష్పాలు, కీటకాలు - వీటి తర్వాత దేవుడు ఆడామ్‌ని సృష్టించాడనీ, అతనికి తోడుగా ఈవాని సృష్టించాడనీ, నందనవనంలాటి 'గార్డెన్ ఆఫ్ ఈడెన్' లో సమస్త జీవరాశి కోపతాపాలు లేని ఆనందమయ జీవితం గడుపుతూండగా, సర్పరాజు దుర్బోధ వల్ల 'ఫర్‌బిడెన్ యాపిల్' ని (జ్ఞానఫలం) ఈవా ఆదామ్ చేత తినిపించి తను తినడంతో, లింగభేదం తెలిపే 'సిగ్గు' యిరువురినీ ఆవరించిందనీ చెబుతారు. ఆ తర్వాత ఆదామ్, ఈవాలు ఆకులు కట్టుకుంటారు; అంతరంగ కల్లోలం ఆరంభమవుతుంది. దైవశాసనం అతిక్రమించిన యిరువురూ ఆ తోటనుంచి గిరవాటు వేయబడతారు. దైవకృప కోల్పోయిన ఆదామ్ ఈవాలు ఒకరికోసం ఒకరు తపిస్తూ, జంతువుల మాదిరి కామాతురతకి లోనవుతారు - ఏబెల్ కెయిన్‌లు జన్మిస్తారు. క్రీస్తుకి పూర్వం 4004 జలప్రళయం నుంచి సర్వప్రాణులనీ జంటలుగా దేవుడు కాపాడాడని బైబిలు కథ చెబుతుంది. జెర్రీ అమల్‌దేవ్ ఉషా ఖన్నాల మ్యూజిక్‌తో, విమల్‌రాజ్, అభిలాష నాయకా నాయికలుగా, తమిళంలో ముత్తులింగం, తెలుగులో రాజశ్రీ పాటలతో, ఈ సంభాషణా రహిత చిత్రాన్ని, నేత్రోత్సవకర దృశ్యాలతో, ఆదామ్ ఈవాల నగ్నత్వంలో ఔచిత్య భంగం లేకుండా, ఎంతో చక్కగా రూపొందించారు దర్శకులు చంద్రకుమార్ - ఫొటోగ్రఫీ కూడా ఆయనే! 'మొదటి అనుభవం' అనగా స్త్రీ పురుష సమాగమానికి సంబంధించిన విషయం కాదు - సెక్స్ కాదు. దేవుని సంతానమైన ఆదామ్ ఈవ్‌లు, ఈ పృథ్వీస్థలి మీదకు మొదటి ప్రాణిని పట్టుకు రావడం! అది సృష్టి లీలే కావచ్చు; కాని, అది వారికి స్వయంగా అనుభవంలోకి వచ్చిన విషయం. అభిలాష, విమల్‌రాజ్ - యిరువురూ మాటలతో నిమిత్తంలేని రసమయ భావ ప్రకటన కనబరిచారు.... పి ఆర్ ఓ: ఫిలిమ్ న్యూస్ ఆనందన్.

## వీడియో మూవీ వారి 'శబరిమల'

విశ్వహిందూ పరిషత్తువారు, వీడియో మూవీ ఇంటర్‌నేషనల్ ద్వారా, శబరిమల పుణ్యస్థలం గురించి, యాత్రా విశేషాలూ, అక్కడ జరిగే పూజాపునస్కారాలు, దండ వేసుకోవడం నుంచి దీక్ష ముగిసే దాకా ఆచరించవలసిన విధులు, క్షేత్ర మహత్యం, వెనకటి చరిత్ర, పురాణగాధ, వేర్వేరు సేవలు, స్వయంగా శబరిమల వెళ్లలేనివారికి, అక్కడి సంగతులన్నీ - కళ్లకి కట్టినట్టు చూపే తొంభై నిముషాల వీడియో కాసెట్ తయారు చేశారు - వివిధ భాషలలో
తోంది. ఇవ్వాళ మారిస్ హూటల్‌లో తమిళంలో కామెంటరీ గల విడియో కాసెట్ పత్రికలవారికి చూపారు. 'శరణమ్ అయ్యప్పా' భజన, సినిమావారి ధర్మమా అని, ఆ ఏటికాఏడు అధికమవుతోంది. రిచుయల్‌లోనే రెలిజియన్ని చూసే ఆధునిక మానవుడు ఆత్మ పారిశుద్ధ్యం కోసం పడే తపనలో యిది ఒక సోపానం. శబరిమలని మీ డ్రాయింగ్ రూమ్‌లో సాక్షాత్కరింపజేసే ఈ విడియో కాసెట్ వెల రు. 185/- Video Movie International, A 3, 2nd Floor, Parsn Commercial Complex, 121, Mount Road, Madras - 600 006. బాంక్‌డ్రాఫ్ట్ పంపుతూ మీకు కావలసిన భాషలోని విడియోకాసెట్ అడగవచ్చు .... పి ఆర్ ఓ: టియమ్ రామన్.







# డైరీ

1988 నవంబరు 03

"బెరియొజ్కా అంటే కొండరావి చెట్టు - ఆ కొండరావిచెట్టు ఆకుని - పచ్చదనానికి పవిత్రతకు చిహ్నంగా చేత ధరించి వేసే జానపద నృత్యం వల్ల ప్రభావితురాలై ఆ పేరు పెట్టిందట 1948లో తన నాట్యబృందానికి నడెజ్‌హూదా! మన కళ్ళముందు కావ్యకన్యకలు మబ్బుల్లో తేలుతున్నట్లుంటుంది ఆ నృత్యం చూస్తూంటే" అని చెప్పింది మాలతి, మ్యూజిక్ అకాడమీలో ఐసిసిఆర్ వారు (Indian Council for Cultural Relations) ఏర్పాటు చేసిన రష్యన్ ఫెస్టివల్ చూసి వచ్చాక! ఇతర పనులవల్ల నేను వెళ్ళలేక పోయాను.

. . . . . 11

'లలితా వనితా కవితా సరితా సరసమాడుకోనా - నరుడా గరుడా ప్రియుడా వరమలాడు కోనా' (వేటూరి రచన) సుశీల, రాజాసీతారామ్ పాడగా, బిసెంటు రోడ్ బీచిలో నరేష్, రమ్యకృష్ణల మీద చిత్రీకరించారు - విజయ కృష్ణా వారి 'పిన్ని'లో. 'యెన్నెల్లో యమ్మా యెన్నెల్లో - అబ్బ ఎన్నాళ్ళకొచ్చింది ఎన్నెల్లా'; 'నిదరలేదమ్మా ఈ జన్మకి - ఎద నిండా సొదలున్న స్త్రీ జన్మకి - త్వరగా నిదురించు తల్లి' - (మొదటిది జాలాది; రెండోది వేటూరి) ఈ రెండు పాటలూ సుశీల పాడగా విజయనిర్మలపై చిత్రించిన ఘట్టాలు ఎంతో రస ప్రపూర్ణమైనవి. అలాగే మరో రెండు చక్కటి పాటలున్నాయి. విజయనిర్మల, నరేష్, రమ్యకృష్ణ, సత్యనారాయణ, చంద్రమోహన్, దగ్గుపాటి, తులసి, కోటశ్రీనివాసరావు, వేలు, వై విజయ, వరలక్ష్మి, పండరీబాయి, నిర్మల మున్నగువారున్న ఈ చిత్రానికి మాటలు మహారథి; సంగీతం: రాజ్‌కోటి. దర్శకత్వం: విజయనిర్మల. సమర్పణ: కృష్ణ; నిర్మాత: రమానంద్; సహ నిర్మాత రఘునాథ్; నిర్వహణ: రవికుమార్; త్వరలో విడుదల కానున్న ఈ చిత్రానికి పిఆర్‌ఒ: రాజు.

నవంబరు 19, 1988

ఏడు దాటాక రాజాగారికి టెలిఫోన్ చేసి 'మెనీమెనీ హేపీరిటర్న్‌స్' అని జన్మదిన శుభాకాంక్షలు తెలుపుదామనుకున్నాము. కాని, ఆయన అరున్న

రకే ఫోనులో 'పదింముప్పావుకి గవర్నమెంట్ మ్యూజియమ్‌లో అశోక కుమార్ శిల్పకళా ప్రదర్శన ; పన్నెండున్నరకి అడయార్ పార్కులో లంచ్ ; మీరూ మాలతిగారు తప్పకుండా వస్తున్నారు' అనేసరికి, సన్మిత్రులు రాజా, ఎంత అవలీలగా ఒక పాయింట్ స్కోర్ చేశారూ అనుకున్నాను. తర్వాత యిద్దరమూ హాపీరిటర్న్స్ చెప్పినప్పటికీ, విజయం అయనదే కదా ! పదిహేనేళ్లుగా చూస్తున్నాను అయన మంచితనమూ మైత్రీ బాంధవ్యమూను. వ్యాపారదక్షతతో బాటు వితరణ గుణశీలి, విద్వజ్జన మిత్రుడు, విబుధవరుల విద్యార్థిననుకొనే వినిర్మలాంతరంగుడు.... 1941లో సిమ్లాలో జనించి, 1961లో పంజాబ్ యూనివర్సిటీ పట్టా పుచ్చుకు, 1963 లో ఆర్మీలో చేరి, 22 ఏళ్ల సైనికోద్యోగం తర్వాత 'ఒయన్‌జిసి' (ONGC)లో చేరిన మేజర్ అశోకకుమార్, చిత్రకళా సంబంధిత శిక్షణ ఏమీ లేకుండా, సహజ తృష్ణతో కొన్నాళ్లు పెయింటింగ్స్ వేసి, అందులో తృప్తి లేక, శిల్పకళ వైపు దృష్టి మళ్లించి, రాతిలోను లోహంలోను రాగసుధ పల్కించి (Sculpture) మెటల్ ఎన్‌గ్రేవింగ్ (Metal Engraving) - ఈ రెండు కళారూపాల్లోనూ ఒక విశిష్టస్థాన మందుకున్నారు. కాంక్రీట్‌తో మార్బిల్‌తో, నల్లరాతితో, బ్రాంజ్‌తో శిల్పాలు రూపొందించారు. మీరెప్పుడైనా డెహ్రాడూన్‌గాని వెళ్తే, 'ఒయన్‌జిసి' ఆఫీసుముందున్న ఆకర్షణీయ శిల్పం అశోకకుమార్‌దేనని తెలుసుకోగలరు. మెటల్ మూరల్స్‌లో (Metal Murals) అయన చూపిన భావోద్వేగ వేదనా మూర్తులు మనని స్పందింప చేస్తాయి. ఈ అద్భుత శిల్పకళాప్రదర్శనని గవర్నమెంట్ మ్యూజియమ్‌లో ఏర్పాటు చేశారు ; స్టేట్ బాంక్ ఛీఫ్ జనరల్ మేనేజరు వి సుబ్బారావు ఈ ప్రదర్శనకు ప్రారంభోత్సవం గావించారు.... మధ్యాహ్నం అడయారు పార్క్ హోటల్‌లో రాజాగారు బర్త్‌డేకేక్ కోశారు ; కోసిన మొదటి ముక్క లక్ష్మిగారి చేత తినిపించగా, అమె రాజాగారి చేత తినిపించారు. సంపద వుండగానే సరిగాదు. ఆ సంపదనీ సంతోషాన్నీ పదిమంది మిత్రులతో పంచుకోగలగడమే రాజాగారి ప్రత్యేకత. అయనకంటె పదిరెట్లు, పాతిక రెట్లు ఐశ్వర్యంగలవారు ఆంధ్రాలో అనేకమంది వున్నారు. కాని, పదకొండేళ్లుగా 'రాజాలక్ష్మి' ఫౌండేషన్ గురించే చెప్పుకుంటున్నారు. ఆ అవార్డ్‌నే ప్రతిష్టాకరమైనదిగా భావిస్తున్నారు - ఎందువల్ల? అయనలోని వితరణ గుణమూ, స్నేహశీలత !....రామోజీ రావుగారితో కాసేపు రాజకీయాలు, పత్రికప్రపంచమూ! ప్రింటింగ్‌టెక్నాలజీ ఎంత అద్భుతంగా పెరిగిపోయిందో తెలుసుకునేందుకు, 'ఈనాడు' ప్రత్యక్ష నిదర్శనం .... భోజనాలై యింటికొచ్చేసరికి రెండున్నర దాటింది.... అయిదున్నరకి రాణీ సీతయ్ హాలులో అసలు ఫంక్షన్ .... 'ఆనందనర్తన

# క్షయ రోగంతో పోరాడండి

1. రెండు వారాలకు మించి ఎడతెరిపి లేకుండా మీకు దగ్గు ఉన్నప్పుడు లేక ఉమ్మిలో రక్తాన్ని గమనించినప్పుడు ఊపిరి తిత్తులకు సంబంధించిన క్షయ రోగంతో మీరు బాధపడుతూ ఉండవచ్చు

2. మీ సమీప మందలి ప్రాదమిక ఆరోగ్య కేంద్రం డిస్పెన్సరీ లేక టి బి సెంటరులో ముఖ్యంగా మీ ఉమ్మిలో సహా మిమ్మల్ని పరీక్ష చేయించుకోండి




3 నిర్ధారిత సమయం వరకు క్రమంగా డాక్టరు ఇచ్చిన సలహా ప్రకారం మందులను తీసుకున్నట్లయితే క్షయ రోగాన్ని నయం చేయవచ్చు

4 చికిత్స కంటే ముందు జాగ్రత్తలు తీసుకోవటం ఎప్పుడూ మంచిదే అందుచేత మీ బిడ్డకు బి సి జి టీకాలు వేయించండి



సెంట్రల్ హెల్త్ బ్యూరో (డి జి హెచ్ ఎస్)
మినిస్ట్రీ ఆఫ్ హెల్త్ అండ్ ఫ్యామిలీ వెల్ఫేర్
కోట్లా రోడ్డు న్యూ ఢిల్లీ 110002

davp 88/412 TEL

గణపతిమ్' పుష్పాంజలితో ప్రియా రాజేంద్రన్ సభికులకు స్వాగతం తెలిపింది. బాలసరస్వతికీ, పద్మా సుబ్రహ్మణ్యానికీ ఈ చిన్నారి వారసురాలు కాగలదని ఎవరో అన్నమాట సామాన్య ప్రశంస కాదు ; నాట్యంపట్ల ఈమెకు అటువంటి ఏకాగ్రత, సుశిక్షణ కనిపించాయి. రూపలావణ్యాలతో బాటు ఆంగికం, అభినయం మెచ్చుకోదగ్గవిగా ఉన్నాయి. "బ్రోచే వారెవరురా" ఎంతో చక్కగా చేసింది ప్రియారాజేంద్రన్ .... సాంబశివయ్య స్వాగత వచనానంతరం, అధ్యక్షులు ఓబుల్‌రెడ్డి, ముఖ్యఅతిధి రామోజీరావు, సన్మానమందు కుంటున్న నారాయణరెడ్డి నాగభైరవ కోటీశ్వరావుల గురించి ప్రసంగించారు. సినారె గురించి తెలిసినంతగా నాగభైరవ గురించి తెలిసివుండక పోవటం సహజం. దక్షిణ రాష్ట్రాలలో ఒక ప్రఖ్యాతకవి వైస్ ఛాన్సలరవడం యిదే ప్రథమం — అన్నారు గోపాలరెడ్డి. మూర్తి వుప్పల, నారాయణరెడ్డికి నూజెర్సీ - తెలుగు ఫైన్ ఆర్ట్స్ సొసైటీవారి ఆహ్వానం అందజేశారు (రాజాలక్ష్మి అవార్డంటే ఇరవైవేలు నగదు - డాక్టర్ రావు జ్యోతీరావు దంపతులు ఏర్పాటు చేసే అమెరికా ట్రిప్ ; పోయిన సంవత్సరం నుంచీ ప్రారంభించిన లిటరరీ అవార్డ్‌కి అయిదువేలు నగదు - మొదటిది సినారెకి, రెండవది నాగభైరవకి). సన్మానపత్రం బాల సుబ్రహ్మణ్యం చదవగా, బహుమతి మొత్తానికి చెక్కు రమణయ్యరాజా అందజేశారు. సంస్కృతాంధ్ర సమాసాలతో నరాల రామిరెడ్డి, XYZ కథతో గొల్లపూడి మారుతీరావు ఉపన్యసించారు. 'ఎవరికి ఈ సన్మానం, ఎందుకు ఈ సన్మానం'? అంటూ నారాయణరెడ్డి తన కృతజ్ఞత తెలిపిన విధం, రమ్యాతి రమ్యంగా ప్రతి హృదయంలోను చిగురు కొమ్మయి నిలుస్తుంది. నవయువత కొత్త ఊపిరిపోసుకొంటే తప్ప మనకి ప్రగతి లేదన్నారు నాగభైరవ. సరోజా గురుస్వామి వందన సమర్పణ. కార్యక్రమాన్ని మిత్రులు పప్పు వేణుగోపాలరావు సరస వచనంతో, ఛలోక్తులతో, సభారంజకంగా నిర్వహించారు.... అయిదున్నరకి ప్రారంభమైన ఈ కార్యక్రమం యించు మించు తొమ్మిదిన్నరకి ముగిసింది - అంటే నాలుగు గంటలు. ఇంత మంది స్పీకర్లతో సభికుల వోపికకు పరీక్ష పెట్టనక్కర్లేదు. కాలాన్ని పొందికగా వాడటం అలవరుచుకోవాలి. ఎంత మంచి ప్రోగ్రామైనా ఎటువంటి సందర్భంలోనైనా రెండూ రెండున్నర గంటలకు మించకూడదు. 'హమ్మయ్య - అయింది' అనిపించకూడదు ; 'అప్పుడే అయిపోయిందా !' - అనిపించాలి.... ఇవ్వాళ రాజాగారి పుట్టినరోజే కాదు - మా అందరికీ పండగలా ఉంది. వేదికమీద ఒకరన్నట్లు, ఇందరి శుభాకాంక్షలు పొందుతున్న రమణయ్య రాజా అదృష్టవంతులు. ఆ దంపతులూ వారి కుటుంబమూ పది కాలాల పాటు చల్లగా ఉండాలని

కోరుకొనే మిత్రశతంలో మేమూ ఒకరం.

## 25

మోనొయాక్టర్ చంద్రశేఖరం రెండవ కుమారుడు నాగ రాజారావు దంపతుల అబ్బాయి చి॥ వెంకటేశ్వ్రరావుకి సౌ॥ శశికళతోను, అమ్మాయి సౌ॥ లతశ్రీకి చి॥ సుబ్బారాయ శాస్త్రి తోను 25 వ తేదీ ఉదయం మకర, కర్కాటక లగ్నాలలో, కుచాలాంబాళ్ కళ్యాణ మహల్‌లో, శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. చంద్రశేఖర మంటే ప్లేబాక్ సింగర్ జానకి మామగారు; జానకి భర్త. పేరు రామ్‌ప్రసాద్; జానకి చెల్లెలు శారద, నాగరాజారావు భార్య - అక్క చెల్లెళు అన్నదమ్ములని చేసుకున్నారు. ఈ శారద, విల్సన్స్ గార్డెన్ స్కూలులో, మా శారదాంబ స్టూడెంట్. ఆ స్టూడెంట్‌కి పెళ్లయింది; పిల్లలు కలిగారు; అబ్బాయికీ అమ్మాయికీ పెళ్లి చేస్తూ, పెళ్లి పిలుపు కని



ఎవరెవరు ? ఏ చిత్రంలోనిది ఆ వేషధారణ ? సరిగా చెప్పగలిగిన మొదటి ఇరువురికి పదేసి రూపాయి బహూకరించగలము. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు చీట్లువేసి మొదటి ఇరువురికే బహుమతి యివ్వడం జరుగుతుంది. మీ జవాబు కార్డు మీదనే వ్రాయండి. మాకు అందవలసిన చివరి తేది: 5-2-1989.

JAGATI - 2, Kutchery Road, P B 2922, Madras - 600 004.

భర్తతో సహా వచ్చి పిలిచి వెళ్లింది.... ఇవ్వాళ రిసెప్షన్‌లో చిట్టిబాబు వీణ ; పి బి శ్రీనివాస్ లలిత సంగీతం.... నూతన వధూవరద్వయానికి మా శుభాకాంక్షలు.

. . . . . 30

సహజ కవి మల్లెమాల (కౌముదీ ఫిలిమ్స్ యమ్మెస్ రెడ్డి) ఈ మధ్య బాంకాక్‌లో జరిగిన 'వరల్డ్ పొయిట్స్ మీట్'కి (విశ్వకవి సమ్మేళనం) వెళ్లి వచ్చిన సందర్భంగా, ఈ సాయింత్రం వారి ఆఫీసులో ఒక చిన్న గోష్ఠి ఏర్పాటు చేశారు. ఆశువుగా కవిత చెప్పడం ఆయనకి చిన్నప్పట్నుంచీ అలవాటు - వెన్నతో పెట్టిన విద్య అంటే ఆయన వొప్పుకోరు. ఎంచేత నంటే, పదకొండో ఏట నుంచీ కష్టపడి పైకొచ్చిన స్వయం కృషీవలుడు. 1967లో సెయింట్ మేరిస్ రోడ్ యింట్లో ఆయన ఉంటున్నప్పుడు, మొదటిసారిగా మల్లెమాల కవిత్వం విని, యింత చక్కటి సృజనాత్మక కవి సినిమా ప్రపంచంలోకి వచ్చి పడ్డారేమిటి ? - అనుకున్నాను. తెలుగు సాహిత్య వాహిని సినీసాగరంలో కలవక తప్పదు. అయితే, ఇరవై రెండేళ్ల తెలుగు సినిమా, ఆయన కవితా గానాన్ని, కవితా సౌరభాన్ని, కవితా హృదయాన్ని ఏవిధంగాను మలిన పరచ లేకపోయింది. సినిమా ప్రపంచమిచ్చే సహజ సమస్యలు ఆయన కవితా పటిమను మరింత పదును పెట్టాయి. నిర్మాతగా కాదు నేను కవిగా మిగిలిపోవాలి - అనే ఆయన తపన నిజమవుతుంది. ఎంచేతనంటే, రెండు దశాబ్దులు ఈ సినిమాలోకంలో గడిపిన తర్వాత కూడా ఆయనలో కించిత్తు నైరాశ్యత లేదు - సహజ కవిలోని కవితాస్వప్నమే ఆయనకి నిత్య నూతనోత్సాహమిస్తోంది .. "ఆచార్య తిరుమల, తెలుగు అకాడమీ కొండ లావు, మాల్‌కొండ రెడ్డి, బాపురెడ్డి మున్నగువారితో బాంకాక్‌లోని విశ్వకవి సమ్మేళనానికి వెళ్లాను. మద్రాసు నుంచి వెళ్లిన తెలుగు కవిని నేను ఒక్కడినే - ఇంగ్లీషు రాని తెలుగు కవిని కూడా నేను ఒక్కడినే ! నా కవితలు కొన్ని ఇంగ్లీషులోకి అనువాదం చేయించి పుస్తకంగా వేయించి తీసుకు వెళ్లాను. అయితే అక్కడ వేదికమీద, తడుముకుంటూ యింగ్లీషులోగాక, తీయందనాల తెలుగులో గళమెత్తి నా కవితా ధార వినిపించగల గొప్ప అవకాశం లభించింది. ఏభై దేశాల నుంచి కవులువచ్చారు ఈ విశ్వకవి సమ్మేళనానికి. ఏభాషలో కవిత చెప్పినా కవులందరిదీ ఒకేబాట, ఒకే మాట," అంటూ బాంకాక్ అనుభవాలు చెప్పారు యమ్మెస్ రెడ్డి. అయిదురోజుల పాటు తాయిలాండ్ ప్రభుత్వ అధ్వర్యంలో జరిగిన ఈ సమావేశంలోని ప్రతిరోజూ ఒక పండగ రోజు. ఎమరాల్డ్ బుద్ధాని చూసేందుకు రెండుకళ్లు చాలవనీ, బాంకాక్ ఒక శృంగారవిపణి అనీ, ఒక్క తల్లి తప్ప మిగతావన్నీ అక్కడ వెలకి లభ్యమవుతాయనీ, వెలవలపు. తరుణులు సర్వసామాన్యమనీ, 1991

లో కెయిరో జరిగే విశ్వకవి సమ్మేళనానికి వెళ్లాలని వున్నదనీ, ఇకనుంచి కవితా రచనలోనే ఎక్కువకాలం వెచ్చించాలని వున్నదనీ అన్నారు మల్లెమాల. గంభీరమైన కంఠస్వరంతో బాంకాక్‌లో చెప్పిన పద్యాలు ఆయన చదివి వినిపిస్తూంటే, కళ్లముందు కదలాడింది ఆ మహానగరం.

1988 డిసెంబరు 01

నేషనల్ కోఆపరేటివ్ యూనియన్ డైరక్టరుగా రిటైరైన సిడి ప్రసాదరావు కుమార్తె సౌ॥ భారతికి (హనుమాయమ్మగారి మనుమరాలు - శాంత చివరమ్మాయి), 'యమ్‌ఆర్‌యఫ్'లో ప్రాజెక్ట్ ఇంజనీరైన వైవియస్ శర్మ దంపతుల కుమారుడు చి॥ శ్రీహరికి (హిందూస్థాన్ ఛాంబర్ జియన్ రావు మనుమడు) నిన్న ఉదయం ఆరు గంటలకు వృశ్చికలగ్నంలో హొటల్ కాంబీలో శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. ఈ సాయింత్రం వుడ్ లాండ్స్‌లో రిసెప్షన్. ప్రసాదరావు గారి కుటుంబం ఇరవై ఏళ్లగా మాకు ఎంతో సన్నిహితం - మాయింటికి మూడో యిల్లే. భారతి అన్నగారు రాము పాండుచ్చేరిలో స్పెషల్ ఆఫీసరు ! ఒక అక్కగారు చెంగల్పట్‌లో ఐపియస్ ఆఫీసరు ; మరొక అక్కగారు రేపో నేడో ఐఎయస్ కానున్నది. అందరూ బాగా చదువుకున్నవారు, భారతీ శ్రీహరీల దాంపత్య జీవితం వారికి సర్వశుభములూ చేకూర్చాలని మనసారా ఆశీర్వదిస్తున్నారు చందూర్ దంపతులు.

. . . . . 04

రమా వామన్‌నాయుడు దంపతుల కుమారుడు చి॥ విక్రమ్‌కి, కృష్ణమూర్తి దంపతుల కుమార్తె సౌ॥ షాలినికి ఈ ఉదయం పది గంటలకు టాజ్ కోరమాండల్‌లో శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. బంధు మిత్రులనేకులు అధిక సంఖ్యలో వచ్చి, నూతన వధూవరులకు శుభాశీస్సులు తెలిపారు.... వామన్ నాయుడు నాగపూర్‌లో పెద్ద కాంట్రాక్టరు ; బిల్డర్స్ గార్డెన్ స్కూలుద్వారా రమ పాతికేళ్లగా తెలుసు : 'శారదాంబగారు రాలేదేమండీ ?' అని అడిగింది రమ. మరొక ఫంక్షన్‌కి తప్పనిసరిగా వెళ్లవలసి వచ్చింది - అని చెప్పాను.

. . . . . 05

చక్రపాణి మనుమరాలు, స్వర్గీయ తిరుపతి రాయుడు కుమార్తె అయిన సౌ॥ అనూరాధకు, శంకరన్ దంపతుల కుమారుడు చి॥ రమేష్‌కు ఈ ఉదయం విజయా శేష్‌మహల్‌లో వైభవంగా వివాహం జరిగింది. నూతన వధూవరులకు మా శుభాకాంక్షలు.... 'యువ' సుధాకర్‌ని చూడగానే చక్రపాణి జ్ఞాపకం రావడం సహజం. తెలుగు సినీప్రపంచంలో చిరస్థాయిగా నిలిచేపేరు చక్రపాణి. తెలుగు సినిమాకు నవ్యతనీ నాజూకునీ వాన గూర్చిన మహానీయుడాయన.

—యన్నార్ చందూర్

అతి రుచికరమైనది

# క్రేన్

వక్కపొడి

దీనికిసాటి మరొకటిలేదు















పీరియత్

# మజిలి

## అన్నపూర్ణారెడ్డి

గాయత్రి తన పిల్లలతో అన్నగారింటికి వచ్చి ఒక చిన్న దుమారం లేపింది. జానకి ఎవరు? అన్నగారు సారథికీ ఆమెకూగల అనుబంధ మేమిటి? పిల్లలు ఆమెని 'పిన్నీ' అని ఎందుకు పిలుస్తున్నారు? వొదెనకు విడాకులిచ్చి జానకినే చేసుకోవచ్చుగా అన్నగారు? ఎందుకీ చాటుమాటు వ్యవహారం? అది గౌరవప్రదమా? .... గాయత్రి అభిప్రాయం సమర్ధనీయమవునో కాదో చదవండి ....

ఎంతో అవసరమైన పని వుంటే తప్ప తనను డిస్టర్బ్ చేయదని ఊహించిన సారథి, "లోపలికిరా, జానకీ!" అని పిల్చాడు.

క్షణకాలం తటపటాయించి భుజాల నిండుగా పమిట చెంగు కప్పుకొని మరింతగా బిగించుకొని లోనికి వెళ్ళి "క్షమించండి మీ చదువు కంతరాయం కల్గించాను" అంది.

చేతిలోని పుస్తకాన్ని మూసేస్తూ "కుర్చో జానకీ...." అంటూ కుర్చీ చూపించాడు. కుర్చీ వంకా, సారథి వంకా ఓ క్షణం చూచి గోడవానుకొని నేలమీద కూర్చుంది.

"పిల్లలు నిద్రపోయారా?"

"ఆ"

"గాయత్రి, పిల్లలు బాగా విసిగించి వుంటారు కదూ?"

ముఖమాటపడిపోతూ: "అబ్బే అలాటిదేం లేదండీ.... సరదాగానే గడిచింది"

తలవంచుకొని కూర్చున్న ఆ అమ్మాయి వంక ఓ లిప్తకాలం పాటు పరికించాడు సారథి....

మంచి పోషణ వల్ల ఆరోగ్యంతో మిసమిస లాడుతున్న శరీరం!.... నిగుతేలిన బుగ్గలు.... ముఖంలో అమాయికత.

కళ్ళు తిప్పేసుకున్నాడు.

ఏం కావాలని అడగడానికి గొంతులో ఏదో అడ్డుపడ్డట్టనిపించి... తనే చెప్పుతుందిలెమ్మన్నట్టు మిన్నకుండిపోయాడు.

నేలమీద వేలితో పిచ్చిగీతలు గీస్తూ "బాబుగారూ" పిల్చింది.

"చెప్పు జానకి"

ఇద్దరి మధ్యా చాలాసేపు నిశ్శబ్దంగా గడిచిపోయింది.

కడపటికి సారథి "ఆరోగ్యం బాగో లేదా?" అన్నాడు.

చిన్నగా నవ్వి "డాక్టర్లకు ఎప్పుడూ ఎదుటివారి ఆరోగ్య ప్రసక్తితప్పా రెండో విషయం గుర్తురాదు" అంది.

ఇద్దరి మధ్యా స్తంభించినట్టున్న వాతావరణం ఆ కాస్త హాసవీచికతో తేలికపడ్డట్టయింది.

తనూ నవ్వేస్తూ "ఏమి చేద్దాం! అది డాక్టర్లు చేసుకున్న అదృష్టం" అన్నాడు సారధి....

జానకి ముఖంలో తిరిగి గంభీర ఛాయలు అలముకున్నాయి.

"బాబుగారూ!... నేనెవరో.... నా పుట్టు పూర్వోత్తరాలేమిటో, ఏ విషయమూ తెలుసుకోకనే ఒకనాటి కాళరాత్రి మీ ఇంట నాకు ఆశ్రయం యిచ్చారు. నేను దొంగనా, దొరనా అని ఆలోచించకుండా ఇంటి తాళం చెవులు చప్పగించి పిల్లల ఆలనా పాలనా నామీద వేశారు. అందుకు నేనెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో అర్థం కావడంలేదు. ఈ ఇంట ఆశ్రయం కల్గించి బ్రతుకు నిశ్చింతగా వెళ్ళదీయడానికి అవకాశం కల్పించి నందుకు మీ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలియడంలేదు."

"ఇప్పుడవన్నీ తవ్వుకోవడం అవసరమా?"

"ఓవిధంగా అవసరమే! .. నా గురించి ఆలోచన నన్ను వేధించడం లేదు కానీ....పది మందిలో గౌరవంగా తిరగవలసిన వ్యక్తి పేరు ప్రతిష్టలకు భంగం వాల్లేటి సూచన ఏర్పడ్డప్పుడు, ఆ వ్యక్తి గౌరవానికి, పేరుకు కళంకం రాకుండా చూచుకోవాల్సిన బాధ్యత నాకుందని అనుకొంటున్నాను...."

అరచేత్తో నుదురు మెడ రాసుకున్నాడు సారధి.. "ఈ కలవరపాటుకు కారణం గాయత్రి మాటలే అనుకొంటాను!" సూటిగా జానకి కళ్ళల్లోకి చూచాడు.

పట్టుపడ్డట్టు తల వాల్చుకొని "గాయత్రిగారేదో అన్నారని కాదు..." తడబడింది.

చాలాసేపు మిన్నకుండి పోయాడు సారధి.... గొంతు సవరించుకొని దృఢస్వరంతో "మనిషి మనస్తత్వం చాలా విచిత్రమైంది జానకీ.... ముఖ్యంగా కొందరికి ఎప్పుడూ ఎవరి గురించో తవ్వి ఆరాలు తీయడం, ఆడిపోసుకోవడం లేదా గోరంతలు కొండంతలుగా ఊహించడం.... ఈలా రోజులు వెళ్ళమార్చుతుంటారు. అలా చేయకపోతే వాళ్ళ కసలుతోచదు. ఇక పోతే స్త్రీ సహజమైన కుతూహలం గాయత్రికి మెండు. అందులోను అన్న పట్ల అభిమానం పాలెక్కువ. అంత మాత్రానికే బెంబేలు పడిపోతే ముందున్న జీవితంలో ఎన్నో ఎదురు చూడని పరిస్థితిలు ఎదుర్కొనే పరిస్థితి రావచ్చు.... జానకీ.... మనిషికి ఆత్మస్థయిర్యం అవసరం."

"ఈ ఇంట.. నా ఉనికి మీకు మచ్చ తేరాదు... నావల్ల మీరు నలుగురిలో వేలెత్తి చూపించుకొనే స్థితి రాకూడదు.. నా గురించి నాకేనాడు బాధలేదు... నా కారణంగా ఇంట కలతలకు, కన్నీటికి తావుండకూడదు".

రుద్ధకంఠంతో అంది. అందులో నిస్సహాయత తొంగి చూస్తూంది.

"ఈశలా ఒకసారి తలెత్తి నా వంక చూడు, జానకీ"

జానకి తల మరింత క్రిందకు వాలి పోయింది.

"నీడను చూచి భయపడ్డం మొదలుపెట్టితే, ఇక ఆ మనిషికి నిలువ నీడ ఎక్కడా లేదు... తప్పు చేసిన వ్యక్తి భయపడ్డంలో అర్థం వుంది. తప్పు లేనిచోట భయంలేదు.... నీ వల్ల నాకు వచ్చిన ప్రమాదం అసలు లేదు .... ఇకపోతే నీ మాటల బట్టి, ఎక్కడైనా ఈ బ్రతుకు వెళ్ళ మార్చ లేనా అన్న, ధీమా అను... తెగింపు అను, నిస్సహాయతతో కూడిన నిర్ణయం వుంది.... సాంఘిక ధర్మం బట్టి, శరీర నిర్మాణాన్ని బట్టి, స్త్రీకి పురుషుడికి ఎంతో తేడా వుంది. అర్ధరాత్రి నడిరోడ్డు మీద పురుషుడు నడవగలిగినంత నిర్భయంగా ఆడపిల్ల నడవ లేదు - రక్షణ అవసరం ఎంతో వుంది. ఒక్కోసారి ఎదురు చూడని ఇబ్బందులు ఎదురైతే తరిమి కొట్టుతాయి."

సారధి అలా అంటున్నప్పుడు జానకి కంటిపాపలు భయంతో అల్లల్లాడాయి. శరీరం రోమాంచితమైంది.

"ఈ నీడను వదిలితే .... తిరిగీ ఇంత నిశ్చింతగా జీవించగలవా?"

భూతంలాటి ప్రశ్న భయపెట్టూంటే అశక్తత ముంచెత్తింది.







"ఈ నా పాపిష్టి బ్రతుక్కు అర్థం లేదు .... ఈలాటి మొండిజీవి బ్రతికినా చచ్చినా ఒకటే .... ఎవరికీ ఏమి ప్రయోజనం లేదు. దుఃఖముతో బాధలతో వేగిపోయిన ఈ జీవితానికి పరిసమాప్తి .... చావొక్కటే...." ఆపుకోలేని దుఃఖావేశంతో భోరున ఏడ్చేసింది.

"జానకీ .... ఏమిటిది .... ఎందుకిలాటి పిచ్చి ఆలోచనలు? ఓ అనుభవజ్ఞుడు ఏమన్నాడో తెలుసా? జీవితంలో దుఃఖం అనేది వున్నప్పుడే సంతోషానికర్థం తెలిసేదిట. సంతోషం లేకపోయినా దుఃఖమయినా తోడుగా వుంటే .... మనిషి బ్రతికేయగలడట. .... కానీ .... కనీసం ఆ దుఃఖమయినా మనిషికి తోడు లేకపోతే ఆ వ్యక్తికి, కఠినశిలకు భేదం లేదుట! కాబట్టి నీవు వాపోయినట్టు సంతోషం తోడురాకపోయినా కనీసం దుఃఖమయినా మనిషిని వెన్నంటి నడిపిస్తోంది. ఎప్పటికైనా సంతోషాన్ని ఆనందాన్ని కైవసం చేసుకోవచ్చనే నిరీక్షణతోనైనా దుఃఖాన్ని తోడుగా చేసుకొని బ్రతికేయడం నేర్చుకోవాలి జానకీ.... ఇకపోతే .... నీవిలాటి పిచ్చి పిచ్చి ఆలోచనలు మానేసి మనసు పాడు చేసుకోనని మాటివ్వాలి.... నిర్భయంగా ఈ ఇంట నీవు కోరినంత కాలం వుండొచ్చు. అంతేకానీ ఎవరో ఏదో అంటున్నారని, అనుకొంటారేమో అని భయంతో మాత్రం కాదు.... గుర్తుంచు ముక్కు ముఖం పమిటతో గట్టిగా తుడుచుకుంది.

"గుడ్‌గర్ల్ .... ఎప్పుడూ కంటతడి పెట్టకు.... వెళ్ళి పడుకో .... ప్రొద్దుపోయింది....ఉదయాన్నే లేవాలి.పోరుగూరికి కేంప్ వెళ్ళాలి" అన్నాడు అవులిస్తూ మౌనంగా వెళ్ళిపోయింది జానకి.

## 14

ఓ రోజు నారాయణ వరండాలో తచ్చాడుతూంటే "ఒరే!.... నారీ.... ఈలారా" అని పిల్చింది జానకి.

"ఎందుకు పిన్నీ?" దగ్గరగా వచ్చాడు. చేయి పట్టుకొని ప్రక్కలో కూర్చొండ బెట్టుకుంది. గువ్వలా ఒదిగి కూర్చున్నాడు.

"నారీ .... ఎందుకురా.... నవరత్నం కొట్టు మీద రాళ్లు విసిరావట?" అంది లాలనగా.

"ఈరోజు విసరలేదు పిన్నీ"

అదేరా .... ఆరోజు"

"చింతకాయల కోసం" పెదిమలప్పెకొంటె నవ్వు.

"చింతకాయల కాలం కాదు కదరా?.... అబద్ధం కదూ?" క్రాపు సవరించింది.

చాలాసేపు మౌనంగా వుండిపోయాడు వాడు.

"పిన్నితో చెప్పవా? .... నీవు నా జట్టే కదా?"

"మరేమో .... మరేమో .... పిన్నీ ఆ నవరత్నం లేదూ .... ఆ దారిన వెళ్ళినపుడంతా .... "ఒరేయ్ .... 'అబ్బ లేని వెధవా' అని పిలుస్తుంది పిన్నీ". (ఇంకా వుంది

